# కమ్యూనిజం

ఆగస్టు 2001

వెల : రు. 10/-

# ఆంధ్ర జాతీయ పునరుజ్జీవనలో కమ్యూనిస్టు పార్టీ మహోజ్జ్వల పాత్ర



ప్రత్యేక సంచిక

# కమ్యూనిజం

## మాసపత్రిక

సంపుటి 27 ఆగస్టు 2001 సంచిక 5

## విషయసూచిక





సంపాదకులు
ఈడ్పుగంటి నాగేశ్వరరావు
పేరకాల పట్టాభిరామారావు

"కమ్యూనిజం" పత్రికలో వెలువడుతున్న వ్యాసాలలోని భావాలతో సంపాదకవర్గం ఏకీభవించనక్కరలేదు. అవి రచయితల అభిప్రాయాలు మాత్రమే.

- సంపాదకవర్గం

కమ్యూనిజం చందా వివరాలు
విడి ప్రతి : రు. 6/-
సంవత్సర చందా : రు. 72/-

వివరాలకు
మేనేజర్, కమ్యూనిజం
చంద్రం బిల్డింగ్స్, విజయవాడ - 520 004

# వీర తెలంగాణా నాది వేరు తెలంగాణా కాదు!

- కీ॥శే॥ రావి నారాయణరెడ్డి



**ముల్కీ-నాన్‌ముల్కీ ఉద్యమం లగాయతు 1969 మొదటి ప్రత్యేక తెలంగాణా ఉద్యమం వరకు జరిగిన ఘటనల క్రమాన్ని తెలంగాణా సాయుధ పోరాట మహా యోధుడు కీ॥శే॥ రావి నారాయణరెడ్డిగారు వివరించుతూ ఈ చీలికవాదం తెలంగాణా ప్రయోజనాలకే ఎలా హానికరమో వివరించారు. 1972లో వారు రచించిన "వీర తెలంగాణ - నా అనుభవాలు, జ్ఞాపకాలు" అన్న ప్రఖ్యాత గ్రంథం నుండి ఈ వ్యాసాన్ని నేటి తరంవారికి అందిస్తున్నాం. - సం॥**

పోలీసు చర్య 1948 సెప్టెంబరులో జరిగింది. జనరల్ చౌదరి అజమాయిషీలో కొంతకాలం పరిపాలన సాగింది. ఆ తర్వాత సివిల్ అడ్మినిస్ట్రేటరుగా వెల్లోడీ వచ్చాడు. 1952లో హైదరాబాద్ రాష్ట్రంలో కూడా ఎన్నికలు జరిగాయి. బూర్గుల రామకృష్ణారావు మంత్రివర్గం ఏర్పడింది. అంతకుముందు నిజాం పైశాచిక పరిపాలన అనుభవించిన ప్రజలకు ఈ మంత్రివర్గంపై ఎంతో ఆశ వుండేది. పోలీస్ చర్య తర్వాత పరిపాలనా సౌలభ్యంకోసం కోస్తా జిల్లాలనుండి, అప్పటి సంయుక్త మద్రాస్ రాష్ట్రంలోని ఇతర జిల్లాలనుండి అధికారులను యిక్కడికి పిలిపించారు. ఆ అధికారులు చేసిన కొన్ని పొరపాట్లను ఆధారంగా చేసుకుని అప్పుడు హైదరాబాద్ నగర ప్రజల్లో ఒక ఉద్యమం వచ్చింది. అధికారంలోకి వచ్చిన ప్రజాస్వామిక ప్రభుత్వం అందరికీ ఉద్యోగా లిస్తుందన్న ఆశ అడియాస అవడం ఈ ఉద్యమానికి ప్రధాన కారణం. "ఇడ్లీ సాంబార్ గోబ్యాక్" అనే నినాదంతో తెలంగాణేతరులకు వ్యతిరేకంగా ఆనాడు ఉద్యమం లేచింది.

భావోద్రేకానికి గురియైన నాటి ఈ ఉద్యమంలో ముందున్నది సాధారణ ప్రజలు. అది హైదరాబాద్ నగరానికి మాత్రమే పరిమితమైంది. తమ భవిష్యత్తు చీకటికాగలదన్న భయమే వారిని ఈ ఉద్యమానికి పురికొల్పింది. అంతేకాకుండా బైటినుంచి వచ్చిన అధికారులు తమ అధికారాన్ని దుర్వినియోగం చేయడం కూడా దీనికి కొంత కారణం కావచ్చును. ప్రభుత్వ ఆస్తికి అపార నష్టం కలిగింది. ప్రభుత్వం నిర్బంధ విధానాన్ని అమలుపరిచింది. ఏ రాజకీయ పార్టీలు, నాయకులు కూడా ఈ ఉద్యమాన్ని ఆనాడు సమర్థించలేదు. వారం రోజుల్లోనే ఈ ఉద్యమం చల్లారిపోయింది. అయితే దీని తర్వాత వచ్చిన ప్రత్యేక తెలంగాణా ఉద్యమానికి బీజం యిక్కడే పడిందన్న మాట మాత్రం సత్యం. దీనికి ముల్కీ ఉద్యమం అని పేరు వచ్చింది.

## మొదటి ప్రత్యేక తెలంగాణా ఉద్యమం

నవంబరు 1956లో ఆంధ్రప్రదేశ్ ఏర్పడింది. అనేక సంవత్సరాలనుండి విశాలాంధ్ర నినాదంతో కమ్యూనిస్టు పార్టీ నడిపిన పోరాటాలకు రూపకల్పన ఏర్పడింది. రాష్ట్రాల పునర్నిర్మాణం గురించి కేంద్ర ప్రభుత్వం నియమించిన ఫజుల్ ఆలీ కమిషన్‌వారు తమ నివేదికలో హైదరాబాద్ రాష్ట్రాన్ని యథాతథంగా వుంచాలని సిఫార్సు చేశారు. కాని సిఫారసును కేంద్ర ప్రభుత్వం అంగీకరించినట్లులేదు. దీన్ని అవకాశంగా తీసుకొని హైదరాబాద్‌లోని కొందరు తెలంగాణా నాయకులు ఫజుల్ ఆలీ కమిషన్ రిపోర్టును అమలుపరచాలని కోరారు. ఒకవేళ హైదరాబాద్‌ను విచ్ఛిన్నం చేస్తే తెలంగాణా జిల్లాలను ప్రత్యేక రాష్ట్రంగా చేయాలని, ఆంధ్ర జిల్లాలతో కలపకూడదని వీరు వాదించారు. దీనికి ప్రధాన నాయకులు మామా అల్లుళ్ళు అయిన శ్రీ కొండా వెంకటరెడ్డిగారు, డాక్టరు మర్రి చెన్నారెడ్డిగారు. ప్రత్యేక తెలంగాణా నినాదంతో బైటికి వచ్చిన వీరి ఉద్యమానికి ఆనాటి కొందరు విద్యార్థులు తోడ్పాటు యిచ్చారు. దానికి వ్యతిరేకంగా నడుంకట్టి ప్రజలను సమీకరించి పోరాడింది కమ్యూనిస్టు పార్టీ. నాకు జ్ఞాపకమున్నంతవరకు ప్రత్యేక తెలంగాణా నినాదాన్ని ఎదిరిస్తూ మొదటి బహిరంగసభ సికింద్రాబాదులో జరిగింది. ఆనాటి సభలో నేను ప్రధాన ఉపన్యాసకుడిని. ఇతరులు కూడా ఉపన్యసించారు. ఈ ప్రత్యేక తెలంగాణా ఉద్యమం నాయకు లాశించినంతగా గ్రామాలకు పాకలేదు. అయితే విశాలాంధ్ర ధ్యేయంతో జిల్లాల్లో నడిపిన సభలు,

సదస్సులను భగ్నం చేయడానికి హైదరాబాద్ నుండి వచ్చిన కొందరు విద్యార్థులు ప్రయత్నిస్తూ వుండేవారు. కాని గ్రామ ప్రజలు వాటిని సాగనిచ్చేవారు కాదు. ఏది ఏమైనా గతంలోని ముల్కీ ఉద్యమంకన్నా ఈ ఉద్యమానికి కొంత ఊపుమాత్రం వుంది. ఈ సందర్భంలో హైదరాబాద్ ఎగ్జిబిషన్ గ్రౌండ్సులో విశాలాంధ్ర సదస్సు ఒకటి ఏర్పాటుచేశాం. దానికి శ్రీశ్రీ అధ్యక్షులు. శ్రీ బద్దం ఎల్లారెడ్డిగారు ఆహ్వాన సంఘాధ్యక్షులు. నేను ఆహ్వానసంఘ కార్యదర్శిని. ఈ సదస్సులో ఆంధ్ర, తెలంగాణా ఇరు ప్రాంతాలనుంచీ కూడా ప్రతినిధులు వచ్చి పాల్గొన్నారు. అటు తర్వాత పాతపట్నంలోని ఒక భవనంలో ఇంకొక సదస్సు ఏర్పాటుచేశాం. దానిలో తెలంగాణా ప్రతినిధులు మాత్రమే పాల్గొన్నారు. దానికి నేను అధ్యక్షుణ్ణి. విశాలాంధ్ర స్థాపనను సమర్ధించడమే ఈ రెండు సదస్సుల ఉద్దేశం.

బహిరంగసభలు ఎన్నో జరిగాయి. అన్నిటికంటే ముఖ్యమైన బహిరంగసభ హైదరాబాదులోని వివేక వర్ధనీ గ్రౌండ్సులో జరిగింది. కాంగ్రెస్‌లో వుండే విశాలాంధ్ర వాదులు, కమ్యూనిస్టులు, ఇరువురూ కలిసి ఏర్పాటుచేసిన బహిరంగసభ యిది. ఆ సభలో ప్రత్యేక తెలంగాణా కాంగ్రెసువాదులు కొంతమంది అల్లరి లేవదీశారు. కాని ఆ సభలో ప్రతినిధులు వారికి దేహశుద్ధి చేసి తగిన విధంగా బుద్ధిచెప్పారు. అంతవరకు గోడమీద పిల్లివాటంగా వున్న ముఖ్యమంత్రి బూర్గుల రామకృష్ణారావుగారు కూడా విశాలాంధ్ర వాదిగా మారారు. ప్రత్యేక తెలంగాణా వాదులనుండి సభను రక్షించమని పోలీసులకు ఆదేశ మిచ్చారు. సభను విచ్ఛిన్నం చేయడానికి వచ్చిన నాలుగైదు వందలమంది కాలేజీ విద్యార్థులకు పోలీసులు బుద్ధిచెప్పారు. ఇలాంటి అవాంతరాలు కలిగినా, ఆనాటి సభ జయప్రదంగా జరిగింది. ఈ కాలంలోనే హైదరాబాదు జిల్లాలో పర్యటిస్తున్న పండిత నెహ్రూ ఆంధ్రప్రదేశ్ ఏర్పడుతుందని ప్రకటించారు. అంతవరకు ఉద్రేకపూరితులైన ప్రత్యేక తెలంగాణా వాదులు వెంటనే చల్లబడ్డారు. ఉద్యమం కూడా సమసిపోయింది. ఉద్యమం చల్లారినా నాయకులు మాత్రం మరొక దారిన తమ ప్రయత్నాలను కొనసాగిస్తూనే వున్నారు. ఈ ప్రయత్నాల్లో భాగమే "పెద్దమనుషుల ఒడంబడిక". దీని ప్రధాన ఉద్దేశం తెలంగాణా ప్రజల్లో వున్న భయాలను తొలగించడం. తెలంగాణా ప్రజలకు, ఉద్యోగులకు రక్షణలు కల్పించడం. దీనికొరకు కాంగ్రెసు నాయకులు ఢిల్లీలో సంప్రతింపులు జరిపారు. ఒక ఒడంబడికను కుదుర్చుకున్నారు.

ఆ కాలంలో ప్రత్యేక తెలంగాణా ఉద్యమాన్ని ఎదిరించి అనేక కష్టనష్టాలకోర్చి, విశాలాంధ్ర స్థాపనకు వెన్నెముకగా నిలిచిన కమ్యూనిస్టు పార్టీని మాత్రం ఈ "పెద్దమనుషులు" మరచిపోయారు. వారిని ఆహ్వానించనూ లేదు. వారి అభిప్రాయాలను కనుగొనేందుకు ప్రయత్నం కూడా చేయలేదు.

ఒడంబడిక కుదిరింది. దానిపైన సంతకాలు జరిగాయి. దానిపై సంతకాలు చేసిన "పెద్దమనుషులు" మాత్రం దాన్ని సక్రమంగా అమలుజరిపి నిజమైన పెద్దమనుషులుగా ప్రవర్తించలేదు. విశాలాంధ్ర సమస్యను కాంగ్రెసులోని అధికార గుద్దులాటల్లో ఒక భాగంగానే వీరు గుర్తించినట్లు స్పష్టమౌతూంది. జాతి సమైక్యతపైన వీరి నిర్లక్ష్య భావం క్షమించరానిది. ఈ ఒడంబడిక యథార్థంగా అమలుజరుగలేదు. ఒడంబడికమీద సంతకాలు చేసిన వారందరూ అధికారానికి వచ్చిన వెంటనే ఆ ఒడంబడికనే విస్మరించారు.

ఇరుపక్షాలవారూ తమ మంత్రి పదవులకు రక్షణ కల్పించుకొనడంలోనే నిమగ్నులైపోయారు. ప్రజలకు కల్పించవలసిన రక్షణలను గురించి వీరు పట్టించుకోలేదు. తెలంగాణా మంత్రులు బాధ్యతగల శాఖలను నిర్వహిస్తూ కూడా, ఒడంబడికలోని అంశాలను అమలుజరిపే బాధ్యత తమపై వుండికూడా పదవుల వేటలో వాటిని పూర్తిగా మరిచేపోయారు. వీరికితోడు కేంద్ర ప్రభుత్వం కూడా తనకేమీ పట్టనట్టు చూస్తూ ఊరుకుంది. ఒడంబడిక ప్రకారం అమలుజరగని భాగాలు ముఖ్యమైనవి రెండు మూడున్నాయి. ఉపముఖ్యమంత్రి పదవి తెలంగాణావారి కివ్వకపోవడం ఒకటి. సంజీవయ్యగారు మాత్రం దీన్ని అమలుజరిపారు. ఉద్యోగాల విషయంలో కల్పించిన రక్షణలు సక్రమంగా అమలుజరగనందున మధ్యతరగతి ప్రజల్లో అసంతృప్తి వ్యాపించింది. తెలంగాణాలోని రివెన్యూను ఆ ప్రాంతపు అభివృద్ధికే వినియోగించాలన్న సూత్రాన్ని కాలదన్నారు. ఈ కాలంలో ఆంధ్ర ప్రాంతంలో మద్య నిషేధం అమల్లో వుండేది. తెలంగాణాలో అట్టి నిషేధం లేదు. అందుకని తెలంగాణా బడ్జెట్టులో ఆబ్కారీ ఆదాయం బాగా వుండేది. నిధులు ఎక్కువగా వుండేవి. ఈ నిధులను మరో ప్రాంతంలో ఏర్పడిన లోటును భర్తీచేయడానికి వినియోగించి వుంటారు. ఈ ఒడంబడికలో అమలుజరపని భాగాలను గురించి అప్పుడప్పుడు ప్రభుత్వ దృష్టికి తెచ్చినా కమ్యూనిస్టు పార్టీ కూడా దీన్ని గురించి ఎక్కువగా

పట్టించుకోలేదు. ఈ ఒడంబడిక అమలుజరపనందువల్ల తెలంగాణా ప్రజల్లో పెల్లుబుకుతున్న అసంతృప్తిని కమ్యూనిస్టు పార్టీ కూడా సరిగా అంచనా వేయలేకపోయింది.

## ప్రత్యేక తెలంగాణా ఉద్యమోద్ధృతి

ఈ రక్షణలను అమలుజరిపించాలన్న వాంఛతో 1969లో ఖమ్మంలో ఒక విద్యార్థి నిరాహారవ్రతం ఆరంభించాడు. దీనివెనక కొందరు కాంగ్రెస్ నాయకులున్నారు. ఈ రక్షణలను అమలుజరిపించే ఉద్యమాన్ని కమ్యూనిస్టు పార్టీ కూడా బలపరిచింది. ఒక విద్యార్థి ఆరంభించిన ఈ ఉద్యమం సహజంగా తెలంగాణా ప్రాంతంలోని విద్యార్థుల సానుభూతిని సంపాదించింది. కాని ఉద్యమం ఒకటి రెండు మాసాల్లోనే ప్రత్యేక తెలంగాణా ఉద్యమ రూపాన్ని దాల్చింది. ఎప్పుడైతే ఈ ఉద్యమం ప్రత్యేక తెలంగాణా వాదంతో పక్కదారులు పట్టిందో, రక్షణలకు అనుకూలంగా వున్న కమ్యూనిస్టు పార్టీ దాన్ని వెంటనే ఖండించింది. ఈ పర్యాయం ఈ ఉద్యమానికి ఒక బ్రహ్మాండమైన ఊపు వచ్చింది. దీనికి ప్రధాన కారణాలు :

ఒకటి : రక్షణలు అమలుజరపకపోబడం, రెండు : ఆంధ్ర ప్రాంతంనుండి వచ్చిన కొందరు మిత్రులు తామే అధికులమన్న భావం (సుపీరియారిటీ కాంప్లెక్సు) చూపడం. ఇది తెలంగాణా ప్రజల్లో విపరీతమైన మానసిక సంక్షోభానికి దారితీసింది. మూడు : అన్నిటికంటే ముఖ్యమైనది కాంగ్రెసువారిలో పదవులకోసం వచ్చిన లోలోపలి కీచులాటలు. నాలుగు : తెలంగాణా నాయకుల పచ్చి అవకాశవాద స్వార్థపరత్వం. అయిదు : విద్యాధికుల్లో వచ్చిన నిరుద్యోగ సమస్య. లోగడ 1955-56లో వచ్చిన ప్రత్యేక తెలంగాణా ఉద్యమకాలానికీ, ఈ ఉద్యమ కాలానికీ మధ్య విద్యాలయాల సంఖ్య, విద్యార్థుల సంఖ్య అసంఖ్యాకంగా పెరిగింది. ఒక్కొక్క జిల్లాలో వందలకొలది హైస్కూళ్ళు నెలకొన్నాయి. ప్రభుత్వ దుష్ట విధానాలవల్ల నిరుద్యోగ సమస్య భయంకరంగా తయారయింది. ఈ భయంకర నిరుద్యోగ సమస్యను చూసి, తమ భవిష్యత్తు అంధకారబంధురం కాగలదన్న భయంతో విద్యార్థులలో అశాంతి పుట్టింది. దీన్ని ప్రత్యేక తెలంగాణావాదులైన నాయకులు తమ స్వార్థానికి చక్కగా ఉపయోగించుకున్నారు. ఈసారి ఈ ఉద్యమం విద్యార్థులకు మాత్రమే పరిమితంకాక గ్రామీణ

ప్రజల్లో కూడా వ్యాపించింది. ఈ దశలో పదవీచ్యుతుడై, అసంతృప్తి చెందివున్న తెలంగాణా రాజకీయ నాయకుడైన డాక్టర్ చెన్నారెడ్డిగారు రంగంలోకి దూకారు. తనలాంటివారి నెందరినో కూడతీసుకున్నారు. అంతకుపూర్వమే కొందరు స్థాపించిన తెలంగాణా ప్రజాసమితి నాయకత్వాన్ని హస్తగతం చేసుకున్నారు. తెలంగాణా ఉద్యమం ఉధృతమైంది.

ఈ ఉధృతమైన ఉద్యమాన్ని ఎదుర్కొని ప్రజలను సమీకరించడానికి కమ్యూనిస్టు పార్టీ శాయశక్తులా కృషిచేసింది. హైదరాబాదు నగరంలో బహిరంగసభలు జరిపింది. సికింద్రాబాదు బహిరంగసభలో జరిపిన పోలీసు కాల్పులు, మరణాల తర్వాత హైదరాబాదులో బహిరంగసభలు లాభంలేదని తీర్మానించింది. కమ్యూనిస్టు పార్టీ తరపున ఢిల్లీకి ఒక ప్రతినిధివర్గం వెళ్ళింది. దానిలో నేను కూడా వున్నాను. ప్రధాని ఇందిరాగాంధీని కలుసుకున్నాము. సమస్యను త్వరగా పరిష్కరించమని, బ్రహ్మానందరెడ్డి మంత్రివర్గాన్ని తొలగించమని ఒక విజ్ఞప్తి పత్రాన్ని ఆమెకు అందజేశాము. ఢిల్లీలో శ్రీ నూకల రామచంద్రారెడ్డిగారిని కలుసుకున్నాము. తాను విశాలాంధ్ర వాదినేననీ, విశాలాంధ్రకు వ్యతిరేకిని కాదనీ వారు మాతో చెప్పారు. కాని ఆ తర్వాత ఆయన ప్రత్యేక తెలంగాణావాదిగా మారి దానికి నాయకత్వం వహించారు. శ్రీ చెన్నారెడ్డిగారితో కూడా మాట్లాడాలని ప్రయత్నించాము. మాకు వారు సమయమిచ్చి, ఒక ప్రత్యేకమైన స్థలంలో కలవమని చెప్పి, తప్పుకున్నారు. ఆయన మాకు కలవలేదు. ఈ విధంగా మా ఢిల్లీ యాత్ర పూర్తి అయింది. అప్పటికే హైదరాబాదు నగరంలో ఈ ఉద్యమం చాలా తీవ్రరూపం ధరించింది. నగరంలో బహిరంగసభలు పెట్టడం అసాధ్యమైపోయింది. అయితే జిల్లాల్లో కొన్ని బహిరంగసభలు పెట్టాం. నల్లగొండ జిల్లాలో పరిస్థితి ఇందుకు కొంత భిన్నంగా వుంది. తెలంగాణా ప్రాంతంలో మేమిచ్చిన ఉపన్యాసాల ప్రభావం ఆంధ్రప్రాంత ప్రజల్లో సద్భావాన్ని కలిగించింది. అలాగే కామ్రేడ్ చండ్ర రాజేశ్వరరావు గారు ఆంధ్ర ప్రాంతాల్లో ఇచ్చిన ఉపన్యాసాలు ఇక్కడి ప్రజలపైన చక్కని ప్రభావాన్ని కలిగించాయి.

ఈ ఉద్యమం విపరీతమైన వెర్రితలలు వేసింది. ఆంధ్రులకు, ఆంధ్ర స్త్రీలకు అవమానకరమైన రాతలతో గోడలు నింపేశారు. ఈ వ్రాతలను చూస్తే తెలంగాణా వాడినైన నాకు సిగ్గువేసేది. నిరశనవ్రతాలు, సత్యాగ్రహాలతో ఆరంభమైన ఈ ఉద్యమం

ఆ దశదాటి బస్సులను, పోస్టాఫీసులను తగలపెట్టి ప్రభుత్వ ఆస్తికి నష్టం కలిగించడం, ఆంధ్ర ప్రాంతము నుండి వచ్చినవారి భవనాలను తగులబెట్టడం దశకు వచ్చింది. విద్యాలయాలన్నీ మూసివేశారు. తలా తోకాలేని అపవాదులను ప్రచారంలో పెట్టారు. ఈ అవకాశాన్ని తీసుకొని సాంఘిక వ్యతిరేక శక్తులు వీరవిహారం చేశాయి. జిల్లాల్లో జనిచేసే ఆంధ్రప్రాంత ఉద్యోగులు, ముఖ్యంగా ఉపాధ్యాయులు తమ పదవులను వదిలిపెట్టి ఆంధ్ర ప్రాంతానికి వెళ్ళిపోయారు. ఈ ఉద్యమంలో గమనించవలసిన విషయం ఒకటుంది. ఇది ఒక ఆంధ్ర ప్రాంతానికి చెందినవారికి వ్యతిరేకంగా మాత్రమే జరిగింది. తెలుగు మాతృభాషగాకాని ఇతరులందరూ ఆనాడు రాష్ట్రంలో క్షేమంగానే వున్నారు.

ఈ ఉద్యమంలో విద్యార్థులతో సంబంధమున్న భూస్వాములు, ధనిక రైతులు, మధ్యతరగతి కుటుంబీకులే ఎక్కువగా పాల్గొన్నారు. పేదప్రజలు, వ్యవసాయ కూలీలు, పట్టణాల్లో పనిచేస్తూవున్న కార్మికులు అంతగా ఈ ఉద్యమం జోలికి రాలేదు.

ప్రభుత్వం విచ్చలవిడిగా పెచ్చరిల్లుతున్న ఉద్యమాన్ని అణచాలని భావించి అనేక ప్రదేశాల్లో తీవ్ర నిర్బంధ విధానాన్ని అమలుజరిపింది. లాఠీచార్జీలు, కాల్పులు దినచర్యగా సాగాయి. ఈ కాల్పులకు గుర్తై అనేకులు నిర్దోషులు మరణించారు. విద్యాలయాలను కూడా అక్కడక్కడ జైళ్ళుగా మార్చి వినియోగించారు. ఈ విధంగా ప్రభుత్వం నిర్బంధ విధానం ద్వారా ఉద్యమాన్ని అణచడానికి ప్రయత్నించింది.

స్వార్థపరులు, అవకాశవాదులు అయిన అసంతృప్తి నాయకుల చేతుల్లో నడిచిన ఈ ఉద్యమం ఎంత తక్కువ కాలంలో ఉధృతరూపం దాల్చిందో అంత తక్కువ కాలంలోనే దిగజారిపోయింది. నాయకుల అవకాశవాద రాజకీయాలు దీనికి ప్రధాన కారణా లయ్యాయి. వీరిలో వీరికి భేదాభిప్రాయాలు వచ్చాయి. ప్రతి ఒక్కడు తనదే నిజమైన తెలంగాణా ప్రజా సమితి అని ప్రకటించుకున్నాడు. ఈ ఉద్యమ కాలంలో రాష్ట్రంలోని అన్ని రాజకీయ పార్టీలు రెండుగా చీలిపోయినాయి. ఈ చీలికలకు గురికాకుండా ఐక్యంగా నిలిచి వేరు తెలంగాణావాదానికి వ్యతిరేకంగా పోరాడిన ఘనత ఒక్క కమ్యూనిస్టు పార్టీకే దక్కింది.

రాష్ట్రంలోని ప్రాంతీయ అసమానతలు, అభివృద్ధులు, తారతమ్యాలే అలాంటి ఉద్యమాలకు ప్రధాన కారణాలు. ఈ అసమానతలు సంపూర్తిగా మాసిపోనిదే ఇకముందు

కూడా ఇటువంటి ఉద్యమాలు తల ఎత్తవనుటకు ఆస్కారంలేదు. కాబట్టి అసమానతలను తొలగించాలన్న ప్రధాన ధ్యేయంతో మొత్తం రాష్ట్ర అభివృద్ధిని, ప్రజల మధ్య భావైక్యతను సాధించడంకోసం అన్ని రాజకీయ పక్షాలవారు కృషిచేసినప్పుడే ఇటువంటి ఉద్యమాలను నిరోధించే అవకాశం వుంటుందని నేను భావిస్తున్నాను.

ఈ ఉద్యమం ముమ్మరంగా సాగుతున్న కాలంలో చీలికవాదాన్ని ఖండిస్తూ నేనొక కరపత్రాన్ని ప్రకటించాను. అది సరిహద్దు తాలూకాల ప్రజల్లో విశేష ప్రభావాన్ని కలిగించిందని నాకు తెలిసింది. ఆ కరపత్రాన్ని యథాతథంగా నేనిక్కడ ప్రకటిస్తున్నాను.

# చీలికవాదం తెలంగాణా ప్రయోజనాలకే హానికరం

## ప్రత్యేక రక్షణల ఐక్య పోరాటానికి కలసిరావలసిందిగా తెలుగు ప్రజలకు రావి నారాయణరెడ్డిగారి విజ్ఞప్తి

భారతదేశంలో అంతర్భాగంగా, ఆంధ్రప్రదేశ్‌లో నివసించే 4 1/2 కోట్ల ప్రజలు ఒక విశిష్టమైన ప్రత్యేక జాతిగా, ఆంధ్రజాతిగా రూపొందారు. జాతి అని పిలువడానికి అవసరమైన లక్షణాలు అనగా ఒకే భాష, ఒకే చరిత్ర, ఒకే సంస్కృతి, ఆచార వ్యవహారాలు, ఒకే భూభాగం కలిగి వున్నారు.

ఆంధ్ర చరిత్ర చూస్తే ఆంధ్ర సాహిత్యాన్ని అవలోకిస్తే చారిత్రకంగా కొన్ని దశల్లో తప్ప యావత్తు తెలుగు ప్రజలు కలిసే వున్నారు. అట్టి ఎడబాటు కూడా పరాయి పాలకుల పాలనలోనే జరిగింది. అయితే సామ్రాజ్య వ్యతిరేక పోరాట దశలో ఈ రెండు ప్రాంతాలు ఉమ్మడి పోరాట సంప్రదాయాలనే కలిగి వున్నాయి.

ఆంధ్ర సారస్వతంలోని కొన్ని మహత్తర కావ్యాలు తెలంగాణా గడ్డమీద తెలంగాణా కవులచే రచింపబడినాయి. అదే విధంగా ఆంధ్ర జీవితంలో ఆంధ్ర కవులచే గూడా రచింపబడినాయి. యావత్తు తెలుగు ప్రజల జీవితంతో ఇవి ముడిపడి వున్నాయి.

ఆధునిక పారిశ్రామిక యుగంలో సైతం ఆంధ్ర ప్రజలు సర్వతోముఖాభివృద్ధి చెందాలంటే, వ్యాపారంలో, విద్యలో, ఆర్థిక కార్యకలాపాలలో, పరిపాలనలో ఒకే భాష ద్వారా తమ వ్యవహారాలను కొనసాగించడం అవసరం. ప్రస్తుతం పరిపాలక వర్గ అభివృద్ధి నిరోధక, సంకుచిత స్వార్థపర విధానాలవల్ల తాత్కాలికంగా కొన్ని చిక్కులు,

కలతలు సంభవించినప్పటికీ ఆంధ్ర ప్రజల సమగ్రాభివృద్ధి సమైక్యాంధ్రలోనే సాధ్యం. దీనికి ఆంధ్ర ప్రజల ఉమ్మడి సంస్కృతి, చరిత్ర పునాది.

ఆంధ్రప్రదేశ్‌ను ఏర్పరిచే సమయంలో తెలంగాణా రక్షణల గురించిన ఒప్పందం కుదుర్చుకొనడం సరియైనదే. ఉభయ ప్రాంతాల భావసమైక్యతా ప్రయోజనాల దృష్ట్యా ఈ ఒప్పందాన్ని ఖచ్చితంగా అమలుజరిపి ఉండాల్సింది.

## పన్నెండేళ్ళ పాపాలు

గత 12 సంవత్సరాలుగా అవిచ్ఛిన్న పరిపాలన సాగించిన కాంగ్రెసు పార్టీ, ఉభయ ప్రాంతాల పెద్దలు కలిసి పవిత్రంగా చేసుకున్న ఈ ఒప్పందాన్ని అమలుపరచడంలో విఫలమైంది. ఈ ఒప్పందం షరతులు అమలుజరపబడకపోవడంలో పరిపాలక వర్గమే యించుమించు యావత్తు బాధ్యత వహించవలసి ఉంటుంది.

అయితే యిందులో కొంతభాగం ప్రతిపక్షాల మీద కూడా వుంది. కమ్యూనిస్టు పార్టీకి, నాకు సంబంధించినంత వరకు శాసనసభ వేదికపైన, ప్రాంతీయ కమిటీలోను మేము చేయగల్గినదంతా చేశాము. అయితే తెలంగాణా ప్రాంతంలోని ఉద్యోగులు, విద్యార్థులు, ఇతర మేధావివర్గాలలో పెరుగుచున్న అసంతృప్తిని అంచనా వేయడంలోను, ఈ సమస్యను ప్రజల దృష్టికి తీసుకొని వెళ్ళడంలోను, తెలంగాణా రక్షణలను అమలుజరిపించుకోడానికి తగు ప్రజా పోరాటాన్ని సాగించటంలోను ప్రతిపక్షాలు విఫలమైనవని ఒప్పుకోక తప్పదు.

అంతేగాదు, తెలంగాణా ప్రజలలో నానాటికీ పెరుగుతున్న ఈ అసంతృప్తిని అవకాశంగా తీసుకొని పాలకవర్గంలోని ముఠాలు తమ స్వార్థ ప్రయోజనాలను సాధించుకోవడం కోసం, యిరుప్రాంతాల వారిమధ్య తంపులు పెట్టగల్గినవారి "విచ్ఛిన్నకర శక్తి"ని కూడా ప్రతిపక్షాలు తక్కువ అంచనా వేయడం జరిగింది.

పెద్దమనుష్యుల ఒప్పందంలోని కొన్ని షరతులు అమలుజరపడంలేదు. కనుక, తెలంగాణాకు అనేక అన్యాయాలు జరిగాయి కనుక, ఈనాడు ఆంధ్ర తెలంగాణాలు విడిపోవాలనీ, ప్రత్యేక తెలంగాణా ఏర్పడాలని అనడంకంటే పొరపాటు, అజ్ఞానం మరొకటి లేదు. అంతేకాదు, ఆంధ్ర ప్రాంతానికి తెలంగాణా ఒక "వలస" ప్రాంతం అయిపోయిందని కూడా కొందరు అంటున్నారు. అన్ని స్థాయిల్లోను తెలంగాణాను

ఆంధ్ర ప్రాంతంలోనివారు దోపిడీ చేస్తున్నారని ఆరోపణలు చేస్తున్నారు. ఆంధ్రప్రాంతం లోను భూస్వాములు, మధ్యతరగతి ప్రజలు, కడకు సమాన్య ప్రజానీకం కూడా తెలంగాణాలో ఆయా వర్గాలను దోపిడీ చేస్తున్నారని వీరు వాదం చేస్తున్నారు. కాని ఇదంతా వాస్తవం కాదు.

ఈ విధంగా అంటున్నవారికి ఒక చిన్న ప్రశ్న వేస్తున్నాను. కృష్ణా జిల్లాలో ఉండే ఒక వ్యవసాయ కార్మికుడు అక్కడ భూస్వాముల దోపిడీకి ఒకవైపు గురి అవుతున్నవాడు, నల్లగొండ జిల్లాలో ఉన్న వ్యవసాయ కార్మికుని ఏ విధంగా దోపిడీ చేయగల్గుతున్నాడు? అక్కడా యిక్కడా పై వర్గాలవారే ప్రజలను అణచిపెట్టి దోపిడీ చేస్తున్నారు.

## అసమానాభివృద్ధి

ఆంధ్రదేశంలో జరిగిన అభివృద్ధి గురించి కూడా పరిశీలించితే కనబడేదేమిటి?

ఆంధ్ర ప్రాంతంలోని 70 నుండి 80 తాలూకాలలో కృష్ణా, గుంటూరు, ఉభయ గోదావరి, నెల్లూరు జిల్లాలలోని 20 తాలూకాలు మాత్రమే వ్యవసాయంలో అభివృద్ధి చెందాయి. ఈ 20 తాలూకాలలో వచ్చిన అభివృద్ధి అంతా గత 12 సంవత్సరాలలోను జరగలేదు. ఈ జిల్లాల్లో జరిగిన అభివృద్ధికి తొలి కారణం అక్కడ ప్రకృతిసిద్ధంగా, భౌగోళికంగా వున్న పరిస్థితి, సారవంతమైన భూమి, సర్ ఆర్థర్ కాటన్ కృష్ణా, గోదావరి ఆనకట్టలను శతాబ్దం క్రితమే నిర్మించి కాలవల ద్వారా చేసిన నీటిసరఫరా ఇందుకు కారణాలు.

ఈ 20 తాలూకాలు మినహా మిగిలిన ఆంధ్ర ప్రాంతమంతా తెలంగాణా జిల్లాలవలెనే వెనుకబడి వుంది. కొన్ని ప్రాంతాలు ఇంకా వెనుకబడి వున్నాయి.

రాయలసీమ నిత్యం కరువులకు ఆటపట్టుగా వున్నది. ఈ కరువు నివారణకు గత 12 సంవత్సరాలలో ప్రభుత్వం యించుమించు ఏమీ చేయలేదని చెప్పవచ్చు.

## అభివృద్ధికోసం ఉభయ ప్రజల పోరాటం

అందుచేత ఈనాడు ఆంధ్ర - తెలంగాణా ఉభయ ప్రాంతాలలోను ప్రజలు మొత్తం ప్రాంతాన్నంతనూ అభివృద్ధి చేయడంలో విఫలమైనందుకు ఈ ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాడవలసి వుంది.

అంతేకాని ఇటీవల తెలంగాణా విద్యార్థులు ఇప్పుడు లేవదీసిన "ఆంధ్రులు

తెలంగాణాను వదిలిపోవాలి" అన్న నినాదంవల్ల తెలంగాణా వెనుకబడ్డ స్థితి తొలగదు. అంతేకాదు ఈ నినాదం చాలా ప్రమాదకరమైన ఫలితాలకు దారితీస్తుంది కూడా.

ఈ నినాదాన్ని అమలుచేస్తే అందువల్ల కల్గే దుష్ఫలితాలు ఏమిటి? తెలంగాణా నుండి పొట్ట చేతబట్టుకొని లక్షలాది ప్రజలు పరాయి ప్రాంతాలకు వలస పోయారు. షోలాపూర్‌లోను, బొంబాయిలోను తెలంగాణా నుండి పోయిన లక్షలాది తెలుగు చేనేత కార్మిక కుటుంబాలున్నాయి. మహారాష్ట్రంలో శివసేన, మహారాష్ట్రం నుండి తెలుగు ప్రజలందరినీ వెళ్ళగొడితే తెలంగాణా ప్రజల పరిస్థితి ఏమిటి? విజయవాడలో అనేక తెలంగాణా కుటుంబాలు తమ బ్రతుకుతెరువుకోసం నివసిస్తున్నాయి. వారిని వెళ్ళగొట్టడానికి విజయవాడ ప్రజలు పూనుకుంటే తెలంగాణా ఏమనుకోవాలి?

## తెలంగాణాకు జరిగిన అన్యాయాలు

అయితే అదే సమయంలో తెలంగాణాకు గత పన్నెండు సంవత్సరాలలోను జరిగిన అన్యాయాలను నేను తక్కువ అంచనా వేయటంలేదు. తెలంగాణా ప్రాంతం రెవిన్యూ మిగులును, పూర్తిగా తెలంగాణా అభివృద్ధికి వినియోగించడంలేదు. తెలంగాణా ఉద్యోగులకు రిక్రూట్‌మెంట్ విషయంలోను, ప్రమోషన్లు, గ్రేడ్లు మున్నగు విషయాలలో ఏకీకృతమైన జాబితాను తయారుచేయడంలోను, అనేక అన్యాయాలు జరిగాయి.

ఇన్ని అన్యాయాలు జరిగినప్పటికీ ప్రత్యేక తెలంగాణా రాష్ట్రం ఏర్పాటు చేయాలన్న నినాదం మాత్రం ఈ సమస్యను పరిష్కరించదు. ఇది తెలంగాణా ప్రయోజనాలకు ఎంతమాత్రం అనుగుణమైనది కాదు.

ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్‌ను యథాతథంగా ఉంచటం ఉభయ ప్రాంతాల పురోభివృద్ధికి అనివార్యం.

## మంత్రివర్గం రాజీనామా యివ్వాలి

ఆంధ్రప్రదేశ్ యథాతథంగా కొనసాగాలని అంటే బ్రహ్మానందరెడ్డి మంత్రివర్గం కొనసాగాలని అభిప్రాయమైనట్లు భావించవద్దు. యథార్థ మేమంటే ఈనాడు ఉద్భవించిన పరిస్థితులు దృష్ట్యా, బ్రహ్మానందరెడ్డి, బ్రహ్మానందరెడ్డి మంత్రివర్గము రాజీనామా యివ్వవలసిన అవసరం ఎంతైనా కలదు. ఈనాడు బ్రహ్మానందరెడ్డి తెలంగాణాకు జరిగిన

అన్యాయాలకు ఒక చిహ్నంగా (Symbol) ఉన్నాడు. గత పన్నెండు సంవత్సరాల నుండి ఎందరో మంత్రులు, ముఖ్యమంత్రులు వస్తూ పోతున్నప్పటికీ, బ్రహ్మానందరెడ్డి మాత్రము ఈ పన్నెండు సంవత్సరాలు మంత్రివర్గంలో ప్లానింగు మంత్రిగాను, ఆర్థిక మంత్రిగాను, ముఖ్యమంత్రిగాను మొదటినుంచి నేటివరకు పరిపాలన సాగించాడు. ఈనాడు బ్రహ్మానందరెడ్డి రాజీనామా ఎన్నియో సమస్యలను శాంతియుత వాతావరణంలో పరిష్కరించుటకు దారితీయగలదని నేను విశ్వసించుచున్నాను.

గత పన్నెండు సంవత్సరాల కాంగ్రెసు దుష్పరిపాలన ఫలితంగా తెలంగాణాలోనూ, తదితర ప్రాంతాలలోను అభివృద్ధి కుంటుపడినప్పటికి ఆంధ్రప్రదేశ్ స్థాపనవల్ల తెలంగాణాకు ఎలాంటి లాభము చేకూరలేదనే వాదనతో నేను ఏకీభవించలేను.

అదృష్టవశాత్తు ఆంధ్ర రాజధాని తెలంగాణా నడిబొడ్డున ఉన్న హైదరాబాద్, ఇప్పుడు విశాలాంధ్రలో వున్న సుమారు 4 కోట్ల ప్రజలకు రాజధాన్ని అయిన తర్వాత నగరం విస్తరించింది. జనాభా పెరిగింది. వర్తక వ్యాపారాలు పెరిగాయి. పరిశ్రమలు పెరిగాయి. అందువలన వేలాది తెలంగాణా కుటుంబాలకు జీవనోపాధి ఏర్పడింది. హైదరాబాదు నగరానికి చుట్టూ 50 మైళ్ళ దూరంలో వున్న గ్రామాలన్నీ ఈనాడు హైదరాబాద్ నగరంమీద ఆధారపడి జీవించుతున్నాయి. పాలు, కాయగూరలు, వంటచెరకు, పశుగ్రాసం మున్నగు వాటిని పెద్ద యెత్తున నగరానికి ఎగుమతి చేస్తున్నాయి. మునుపటికంటే ఈనాడు ఈ అన్ని గ్రామాలలో పనిపాటలు పెరిగాయి.

## రాజధానివల్ల కల్గిన అభివృద్ధి

ఒక్క భువనగిరి తాలూకా నుండి ఏడాదికి రు. 25 లక్షలు విలువ గల్గిన పాలు హైదరాబాద్ నగరానికి ఎగుమతి అవుతున్నాయి. అంటే హైదరాబాద్ పరిసర ప్రాంతాలు రాజధాని అభివృద్ధివలన ఏ విధంగా లాభపడుతున్నవో అనడానికిది మచ్చుతునక.

హైదరాబాద్ రాజధాని అయిన తరువాత ప్రభుత్వ రంగంలోను, ప్రైవేటు రంగంలోను అనేక పరిశ్రమలు ఏర్పడ్డాయి. ఇందువలన నగరంలోని ప్రజలకు, పరిసర ప్రాంతాల ప్రజలకు ఎక్కువ ఉద్యోగాలు, ఉపాధి కల్పన జరిగింది. ఇకముందు కూడా అట్టి అవకాశాలు పెరుగుతాయి. హైదరాబాద్‌లో సినిమా పరిశ్రమ కూడా అభివృద్ధి

అవుతూంది.

ఇట్టి పరిస్థితుల్లో ప్రత్యేక తెలంగాణా ఏర్పరచాలని కోరడం అంటే హైదరాబాదును 20 జిల్లాలకు రాజధానిగా ఉండటానికి బదులు వెనుకబడివున్న 8 జిల్లాలకు రాజధానిగా హీనస్థాయిలోకి తీసుకురావడమే అవుతుంది. అప్పుడు హైదరాబాద్ జనాభా తగ్గిపోతుంది. వర్తక వ్యాపారాలు తగ్గిపోతాయి. ప్రత్యేక తెలంగాణాలో ప్రజలకు పనులు పడిపోతాయి.

## చీలిక ఉద్యమం దుష్ఫలితాలు

ప్రత్యేక తెలంగాణా ఉద్యమం నడిచిన గత మూడు మాసాలలో యీ ఉద్యమం యొక్క దుష్ఫలితాలు నగర ఆర్థిక జీవితంపై స్పష్టంగా అగుపడుచున్నవి. ఎన్నియో భవనాల నిర్మాణం ఆగిపోయినది. కష్టజీవులకు కూలి తగ్గింది. వర్తక వ్యాపారాలు సన్నగిల్లుచున్నవి. టాక్సీల, రిక్షాల గిరాకీ తగ్గిపోయింది. పరిస్థితి యిదే విధంగా కొనసాగినచో ఈ పరిణామాలింకా తీవ్రతరమౌతాయి.

అంతేకాదు, ప్రత్యేక తెలంగాణా రాష్ట్రం ఏర్పడితే దాని ఆర్థిక పరిస్థితి ఎలా వుంటుంది? ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంనుండి ప్రత్యేక తెలంగాణా రాష్ట్రానికి సంక్రమించేది ఏమిటి? ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ ఆర్థిక పరిస్థితులు కాంగ్రెస్ ప్రజావ్యతిరేక విధానాల పుణ్యామా అని దివాళాకోరు స్థితిలో వున్నాయి. రిజర్వుబ్యాంక్ ఆంధ్రకు ఓవర్ డ్రాఫ్టులు యివ్వడానికి నిరాకరించుతూంది. కేంద్రం ఆర్థిక సహాయం యివ్వడానికి తిరస్కరించ ుతూంది. అంచేత దివాళాకోరు ఆర్థిక పరిస్థితులు మాత్రమే ప్రత్యేక తెలంగాణాకు సంక్రమించుతాయి. ఇప్పుడు తెలంగాణా నిధులు అంటూ వున్న మిగులు, ప్రస్తుతం తెలంగాణాలో వస్తున్న ఎక్సైజు ఆదాయం తెలంగాణా రాష్ట్రానికి ప్రభుత్వ యంత్రాంగాన్ని ఏర్పరచడంలో హరించుకుపోతాయి.

ప్రత్యేక శాసనసభ, మంత్రివర్గం, సెక్రటేరియట్, డైరెక్టరేట్లు ఇవన్నీ తెలంగాణా మిగులు నిధులను కాస్తా తినివేస్తాయి.

## అభివృద్ధికి బదులు అప్పులు మెడబడతాయి

అంతేకాదు, ఇప్పుడు తెలంగాణా ఆంధ్రనుండి విడిపోతే యీ 12 ఏళ్ళుగా ఏర్పడిన మిగులు నిధులు చేతికిరావు. ఆస్తులు అప్పులు అన్నీ తేల్చేసరికి ఉమ్మడి

రాష్ట్రం చేసిన అప్పులన్నీ ఆ నిష్పత్తిలోనే తెలంగాణా మెడకు చుట్టుకుంటాయి. కేంద్రం నుండి వచ్చే వాటాల నిష్పత్తి తగ్గుతుంది.

అందుచేత ప్రత్యేక తెలంగాణా ఏర్పడితే ఏదో అమాంతం అభివృద్ధి జరిగి పోతుందని కలలు కనేవారికి ఇవి పీడకలలుగా పరిణమిస్తాయి. పోచంపాడు ప్రాజెక్టు నిర్మించాలని మనం ఏ కలలు కన్నామో ఆ ప్రాజెక్టు నిర్మాణానికి డబ్బు వుండదు. గ్రామాల విద్యుదీకరణకు డబ్బు ఉండదు. విద్యా సౌకర్యాలను పెంచుకోడానికి కావలసిన అదనపు నిధులు వుండవు. ఏ యితర అభివృద్ధి కార్యకలాపాలకు తెలంగాణా ప్రత్యేక రాష్ట్రంలో డబ్బు వుండదు. ప్రత్యేక తెలంగాణా ఆర్థికంగా స్వయంపోషకంగాని రాష్ట్రంగా తయారవుతుంది.

## అన్నానికి భిక్షాందేహి

ఆహార ధాన్యాలలో ప్రత్యేక తెలంగాణా స్వయంసమృద్ధిగా ఉండలేదు. కోస్తా జిల్లాలలోవున్న దాదాపు 30 లక్షల ఎకరాల సారవంతమైన మాగాణి భూములు వేరుపడిపోయిన తర్వాత ప్రత్యేక తెలంగాణా పూర్తిగా తరుగుప్రాంతంగా వుండి పోతుంది. భారతదేశము విభజింపబడినప్పుడు పశ్చిమ పాకిస్తాన్‌లోను, తూర్పు పాకిస్తాన్‌లోను ఉన్న సస్యశ్యామలమైన మాగాణి భూములు భారతదేశానికి చెందకుండా పోయినప్పుడు, భారతదేశం ఏవిధంగా తరుగు దేశంగా ఉండిపోయి నేటివరకు ఆ పరిస్థితి నుంచి బైటపడకుండా వున్నదో, అదే పరిస్థితి ప్రత్యేక తెలంగాణాకు గూడా ఏర్పడుతుందని చెప్పుట అతిశయోక్తి కాజాలదు. ఈ రోజు ఆంధ్రప్రదేశ్ ఆహార ధాన్యాల విషయంలో మిగులు రాష్ట్రం. ప్రత్యేక తెలంగాణా, కేరళ రాష్ట్రంవలె భిక్షాందేహి అని ఆహార ధాన్యాలకొరకై ఇతరులను ప్రార్థించక తప్పదు.

## అవినాభావ సంబంధంగల ఆర్థిక వ్యవస్థ

ఆంధ్రప్రదేశ్‌లో అభివృద్ధికి నేడు కావలసిన అన్ని అవకాశాలు, వనరులు ఉన్నాయి. లేనిదల్లా నిజమైన ప్రజా ప్రభుత్వమే. అందుచేత ఆంధ్రప్రదేశ్‌లో అట్టి సరియైన ప్రభుత్వాన్ని ఏర్పరచుకోగలిగితే ఇటు తెలంగాణాలో గల ఖనిజ సంపదను, అటు ఆంధ్రప్రాంతంలో ఉన్న వ్యవసాయ సంపదను కలబోసుకొని రాష్ట్రాన్ని సర్వతోముఖంగా అభివృద్ధిచెందించవచ్చు. అంటే మన రెండు ప్రాంతాల ఆర్థిక వనరులు అవినాభావ

సంబంధం కల్గినవి. ఒకదాని కొకటి అనుబంధంగా ఉండవలసినవి.

తెలంగాణాలో అపారమైన బొగ్గు, అనేక రకాల ఖనిజాలు వున్నాయి. ఆంధ్ర జిల్లాలు వ్యవసాయరీత్యా అభివృద్ధిచెందినవి. అందుకనే పారిశ్రామికీకరణకు కావలసిన పెట్టుబడి ఈ వ్యవసాయ రంగంలోని మిగులునుండి ఏర్పడవలసి ఉంటుంది.

అంతేకాదు వ్యవసాయ విధానంలో ఆంధ్ర ప్రాంతంనుండి తెలంగాణా ప్రాంతం నేర్చుకోవలసింది ఎంతో ఉంది.

ఇప్పుడు ఆంధ్రప్రదేశ్‌లో ఒక ప్రథమ శ్రేణి ఓడరేవు విశాఖపట్నం వుంది. వందలమైళ్ళ సముద్రతీరం వుంది. ఇంకా చిన్న ఓడరేవులు అనేకం వున్నాయి. ఇంకా అవి అభివృద్ధికావాలి. అందువలన ఆంధ్రప్రదేశ్ ఎగుమతి వ్యాపారం పెరుగుతుంది. ఆంధ్రనుండి తెలంగాణా విడిపోతే సముద్రతీరం అంటూ ఉండని, చుట్టూ భూపరివేష్టిత మైన తెలంగాణా ఏర్పడుతుంది. తెలంగాణాకు ఓడరేవులంటూ వుండవు. ఉత్తరోత్తరా తెలంగాణా ప్రాంత భవితవ్యానికి యిది హానికరం.

అంతేకాదు, ప్రత్యేక తెలంగాణా రాష్ట్రం ఏర్పడితే అది తిరిగి దొరల రాజ్యంగా తయారయే ప్రమాదం ఉంది. ఆంధ్రప్రదేశ్ అంతటిలోకి తెలంగాణా ప్రాంతంలోనే ఈనాటికీ ఫ్యూడలిజం, భూస్వామ్య నిరంకుశత్వం విచ్చలవిడిగా రాజ్యం చేస్తూవుంది. అందుచేత ప్రత్యేక తెలంగాణా అంటూ ఏర్పడితే ఆ రాష్ట్ర ప్రభుత్వంలో భూస్వామ్య అభివృద్ధి నిరోధక వర్గాల పెత్తనమే ఉంటుంది. అయితే అంతమాత్రాన ఆంధ్ర ప్రాంతంలో ఇటీవల ఏర్పడిన "నడమంత్రపుసిరి" వర్గాల అభివృద్ధి నిరోధక స్వభావాన్ని తక్కువ అంచనావేసే సమస్యేలేదు. కాని రాష్ట్రం పెద్దదిగావుంటే ఈ అభివృద్ధి నిరోధక శక్తులను అదుపులో పెట్టడానికి, విశాల ప్రజోద్యమాలను నిర్మించడానికి వీలవుతుంది. ఈ శక్తుల పరస్పర వైరుధ్యాలు అనేకం పనిచేస్తాయి.

## గుత్తదారుల పెత్తనం

రాష్ట్రం చిన్నదైనకొద్దీ దేశంలోని గుత్తపెట్టుబడిదారీ వర్గాలకు ఆ రాష్ట్రంలో పెత్తనం చెలాయించడానికీ, కుట్రలు చేయటానికీ ఎక్కువగా వీలుగా వుంటుంది. రాష్ట్రాలను ముక్కచెక్కలుగా చేస్తే వాటిని చాలా సులువుగా తమ గుప్పెట్లో పెట్టుకోవచ్చు. పెద్ద రాష్ట్రాలయితే వారికి కొరుకుడుపడటం కష్టం. అందుకే నిజానికి

బిర్లాలు, తాతాలు అట్టి చిన్న రాష్ట్రాలను నేడు కోరుతున్నారు. సౌరాష్ట్ర, మధ్యభారత్, ఝార్ఖండ్, ఉత్తర, దక్షిణ యు.పి.లు ప్రత్యేక రాష్ట్రాలుగా కావాలని ఈ గుత్తవర్గాలు ఉబలాటపడుతున్నాయి. ప్రత్యేక విదర్భ ఆందోళన ఇదివరకే వుంది.

## ఆచరణ సాధ్యంకాని విషయం

అసలు ప్రత్యేక తెలంగాణా రాష్ట్ర నినాదం ఆచరణ సాధ్యమైన నినాదం ఎన్నటికీ కాజాలదు. అన్ని రాజకీయ పార్టీలు దానికి వ్యతిరేకంగా వున్నాయి. తెలంగాణాను విడదీస్తే అదేవిధంగా ప్రత్యేక రాష్ట్రాలు ఏర్పడాలంటూ అనేక రాష్ట్రాలలో వచ్చిన డిమాండును కూడా కేంద్రం అంగీకరించవలసి వుంటుంది. ప్రత్యేక భాషా రాష్ట్రాలు అవతరణ ఎంతో పోరాటం జరిగిన తరువాత ఎన్నో త్యాగాల ఫలితంగా ఏర్పడింది. ఇప్పుడు ఆ రాష్ట్రాలన్నింటి విభజనకు పార్లమెంటు ఒక్కనాటికీ ఒప్పుకోదు. పార్లమెంటు సభ్యులు ఈ వాదనను తప్పక త్రోసిపుచ్చుతారు. అంతేకాదు, ఈ విధంగా రాష్ట్రాలను ఛిన్నాభిన్నం చేయడానికి వివిధ రాష్ట్రాలలోని ప్రజలు ఎన్నటికీ సహించరు.

అందుచేత తెలంగాణాకు ఈ పన్నెండు ఏళ్ళుగా జరిగిన అన్యాయాలను తొలగించడానికి, దానికి సహకరించడానికి మార్గం ప్రత్యేక తెలంగాణా రాష్ట్ర నిర్మాణం కానేకాదు. అది తెలంగాణా ప్రయోజనాలకు ఎంతమాత్రం శ్రేయస్కరం కాదు.

## రక్షణల అమలుకు ఐక్యాందోళన

తెలంగాణాకు ఇచ్చిన ప్రత్యేక రక్షణలను అమలుజరిపించుకోడానికి ఎడతెగని ఐక్య ఆందోళన సాగించడం ఒక్కటే మార్గం. ఆంధ్ర ప్రాంతంలో మద్యనిషేధాన్ని రద్దుచేయాలని ఆందోళన చేయడం కూడా అవసరం. అందువలన ఆంధ్ర ప్రాంతానికి దాదాపు రు. 25 కోట్లు అదనపు ఆదాయం లభించుతుంది. మైసూరు, మహారాష్ట్ర, మద్రాసు రాష్ట్రాలలో చేసింది ఆంధ్రలో ఎందుకు చేయకూడదు?

తెలంగాణా ప్రాంతానికి జరిగిన అన్యాయాన్ని తెలంగాణా విద్యార్థులు మొట్ట మొదటిసారిగా యావత్తు రాష్ట్ర, దేశ ప్రజల దృష్టికి కూడా తీసుకొనివచ్చారు. అందుకు వారెంతో అభినందనీయులు. తెలంగాణా ప్రత్యేక రక్షణల పోరాటానికి ఈ ఆందోళన ఒక ప్రాతిపదికను ఏర్పరచింది.

కాని ఈనాడు తెలంగాణా విద్యార్థులు ప్రత్యేక తెలంగాణా నినాదం చేపట్టి

తాము ఏ ప్రయోజనాలను సాధించుకోవాలనుకుంటున్నారో, అట్టి ప్రయోజనాలు సిద్ధించకుండా ఉండే మార్గంలో నడుస్తున్నారు. తమ యువకశక్తిని వృధా చేస్తున్నారు. ఒక చెడ్డ లక్ష్యానికి తమ శక్తిని వెచ్చిస్తున్నారు. ప్రత్యేక తెలంగాణా దాని ప్రయోజనాలకు పూర్తి విరుద్ధం. అందుచేత ఈ ప్రత్యేక తెలంగాణా నినాదాన్ని వారు విరమించి తెలంగాణాకు అన్యాయం చేసిన ఈ ప్రభుత్వం వైదొలగాలన్న ఆందోళనకు, తెలంగాణా ప్రత్యేక రక్షణలను అమలుజరిపించుకునే ఐక్య పోరాటానికి కలిసిరావాలి. తెలంగాణాలోని అధ్యాపకులందరూ విద్యార్థులను ఈ పొరపాటు దోవనుండి మళ్ళించాలి. చీలికవాదానికి వ్యతిరేకంగా ఉభయ ప్రాంతాలలోని ప్రజాతంత్ర అభివృద్ధికర శక్తులన్నీ ఏకంకావాలి.

- "వీర తెలంగాణా - నా అనుభవాలు - జ్ఞాపకాల్లు" నుండి, 1972

## రక్తాక్షరాలలో చరిత్ర నిర్మించిన "వీర తెలంగాణ"

**ఈ చారిత్రక పోరాటం యొక్క గుణపాఠాలు మరుగునపడిపోరాదు. ఆదర్శరహితమైన నేటి రాజకీయ ప్రపంచంలో అధికారంలో వున్నవారే పత్రికలలో పెద్ద అక్షరాలలో అగుపడుతుంటారు. అదివరకు జరిగిన సంఘటనలు, పోరాటాలూ మరుగునపడిపోతాయి. చరిత్ర నుంచి గుణపాఠాలు నేర్చుకొనేబదులు చరిత్రనే ఖూనీచేస్తారు.**

**- రావి నారాయణరెడ్డి**

# నేనూ - నా దేశం

## (ఆంధ్ర గదర్ వీరుడు - దర్శి చెంచయ్య స్వీయచరిత్ర)

ఆచార్య వకుళాభరణం రామకృష్ణ
102, దేవరత్న అపార్ట్‌మెంట్స్,
మెహదీపట్నం, హైదరాబాద్-28

గత శతాబ్ది సగభాగందాకా భారతదేశం వలస పాలనలో వుండిపోయింది. జాతీయ విముక్తి ఉద్యమం దేశ స్వాతంత్ర్యం కోసం పోరాడి సాధించింది. 1850 లగాయతు, ఆంధ్రదేశంలో, 1947 దాకా, దాదాపు నూరు సంవత్సరాలు ఆంధ్రదేశం పలు ఉద్యమాలతో అట్టుడికి పోయింది. సంఘ సంస్కరణతో ప్రారంభించి, జాతీయోద్యమం, వామపక్ష భావాలతో ప్రేరణచెందిన కార్మిక, కర్షక, స్త్రీ, యువజన, విద్యార్థి, సాంస్కృతికోద్యమాలు ఒకవైపు తెలుగు జాతిని పునరుజ్జీవింపచేస్తూ, ఇంకొకవైపు జాతీయ విముక్తికోసం పోరాడాయి.

ఈ చారిత్రక సన్నివేశంలో, దాదాపు యాభైమందికి పైగా, తెలుగువారు తమ స్వీయచరిత్రలు రాసుకొన్నారు. ఇవి కేవలం వారి జీవితానికి సంబంధించిన వివరాల పట్టీలు కావు. జీవిత ఘటనలతో, ఉద్యమ వివరాలను రంగరించిన ఉద్యమ చరిత్రలు. 19వ శతాబ్దపు రెండో భాగంలో కందుకూరి వీరేశలింగంచే ఆరంభింపబడిన యీ సాహిత్య ప్రక్రియ - "స్వీయ చరిత్ర" - ఆధునిక ఆంధ్రదేశ చరిత్ర రచనకు చక్కని ముడిసరుకు.

ఈ జీవిత చరిత్రలన్నీ ముఖ్యమైనవి కాగా, వాటిలో ప్రముఖంగా చెప్పుకోదగ్గ

వాటిలో దరిశి చెంచయ్య, 'నేనూ - నా దేశం' ఒకటి. ఆయన జననం 1890లో. అప్పటినుండి 1948 దాకా, వేరే విధంగా చెప్పుకోవాలంటే, అఖిల భారత జాతీయ కాంగ్రెస్ కాలం నుండి, దేశ స్వాతంత్ర్యం దాకా యీ గ్రంథం, ఆంధ్రదేశ చరిత్రను స్థూలంగా తెలియచేస్తుంది. చెంచయ్యగారి స్వీయచరిత్ర యింకా అనేక విధాల ముఖ్యమైన గ్రంథంగా పరిగణించాల్సి వుంది. జాతీయ, సంస్కరణ, వామపక్ష ఉద్యమాల్లో నాయకత్వ స్థాయిలో - అంటే పైస్థాయిలో వున్న మహనీయులు రాసుకున్న జీవిత చరిత్రల ద్వారానే మనం అప్పటి చరిత్రను గ్రహించగలిగాం. పై స్థాయి కాకుండా, మధ్యమ లేక కింది స్థాయిలో వున్న నాయకుల లేదా కార్యకర్తల జీవితాల్ని పఠించి, విమర్శించి, విశ్లేషించిన సమయాలు అరుదు. ఆదేకాదు యీ స్థాయికి చెందిన కార్యకర్తల జీవితాల్లో, చరిత్ర ఉపశ్రేణి (Sub altern)కి చెందిన అనేకానేక అంశాలు మన దృష్టికి వస్తాయి. పైగా యీ స్థాయి నాయకులు, అప్పటి ఘటనలను చూసిన తీరు కూడా భిన్నంగా వుండచ్చు. ఇక, దరిశి చెంచయ్యగారి జీవిత చరిత్ర, అప్పటి మూడు ప్రధాన ఉద్యమాలనూ చర్చిస్తుంది. వాటిపై వెలుగును ప్రసరిస్తుంది. ఇక్కడ చెంచయ్య, ఒక ప్రేక్షకుడుగా, పక్కన నిలబడి ఘటనల గూర్చి చెప్పటం లేదు. ఆయన యీ మూడు ఉద్యమాల్లో క్రియాశీలక పాత్రను నిర్వహించాడు. అందువల్లే, ఈ గ్రంథానికి అంత ప్రాముఖ్యత రావడం.

1890 సంవత్సరంలో, అప్పటి నెల్లూరు జిల్లా (ప్రస్తుతం ప్రకాశం జిల్లా) కనిగిరిలో, పేద వైశ్యకులంలో జన్మించాడు దరిశి చెంచయ్య. కనిగిరి ప్రాంతం, పూర్తిగా మెట్ట ప్రాంతం. వర్షపాతం తక్కువ. జీవనం దుర్భరంగా వుండేది. మెట్రిక్యులేషన్ దాకా చదివిన చెంచయ్య, చిన్ననాడే సంస్కరణలవైపు ఆకర్షింపబడ్డాడు. ముఖ్యంగా తన కులానికి చెందిన ఆత్మన్యూనతా భావాన్ని (Inferiority Complex) గమనించి ఆందోళనకు గురయ్యాడు. కులాన్ని నిరసించడం అప్పుడే ఆయనలో ప్రారంభమైంది. అప్పట్లో విదేశీ విద్యపై మోజు వుండేది. తన కులానికి చెందిన వారి సాయంతో, అమెరికా సంయుక్త రాష్ట్రాల్లో కాలిఫోర్నియాలో పైచదువులూ, జీవితానికి ఉపయోగపడే విద్యా, వృత్తులను నేర్చుకొని రావాలని బయలుదేరి వెళ్ళాడు. ఈ ఘటన ఆయన జీవితంలో పెనుమార్పుకు దారితీసింది. 1912లో బర్కిలీ పట్టణంలో అప్పటికే

అనేకమంది భారతీయులు, ముఖ్యంగా ఉత్తర భారతానికి చెందిన పంజాబీయులు చదువుకొంటూనో, ఉద్యోగాలు చేసుకుంటూనో వున్నారు. వారిలో దేశభక్తి, జాతీయ విముక్తి భావాలు చోటుచేసుకున్నాయి. సాయుధ సైనిక తిరుగుబాటు ద్వారా భారతదేశ విముక్తి సాధించాలన్నది, వారు స్థాపించిన 'గదర్' పార్టీ ఆశయం. లాలా హరదయాళ్, జితేంద్రనాధ్ లాహిరీలు గదర్ పార్టీ నాయకులు. ఉత్తేజపూరిత ఉపన్యాసాలు, విప్లవ శిక్షణ, భారతీయులకు యిస్తున్నారు. చెంచయ్యగారు ఆ ఉద్యమంలో చేరారు. దేశ విముక్తి తన తక్షణ కర్తవ్యంగా భావించి, చదువు సంధ్యలు వదిలేసి గదర్ పార్టీలో ముఖ్య కార్యకర్తగా ఎదిగారు.

మొదటి ప్రపంచ యుద్ధం జరుగుతున్న రోజులవి. ఇంగ్లండ్ ఇరకాటంలో పడింది. ఆ అవకాశాన్ని వినియోగించుకొని, 1925 కల్లా దేశ విముక్తి జరిగి రిపబ్లిక్‌ను ఏర్పర్చాలని గదర్ వీరుల ఆశయం. అమెరికా సంయుక్త రాష్ట్రాల నుండి బయలుదేరి గదర్ వీరులు, దారిలో చిక్కుకొనిపోయి దూర ప్రాచ్యం, తూర్పు ఆసియా ప్రాంతాల్లో నిలబడిపోయారు. సింగపూర్‌లో భారత సైనికుల తిరుగుబాటు జరిగితే, అందులో చెంచయ్యగారు పాల్గొన్నారు. బందీగా దొరికిపోయి, అక్కడి కారాగారాల్లో పడిన బాధలను గూర్చి గ్రంథంలో రాశారు. అక్కడినుండి తప్పించుకొని భారతదేశం చేరడంతో గదర్ పార్టీ ఘట్టం ముగుస్తుంది. గదర్ తిరుగుబాటు, మన స్వాతంత్ర్యోద్యమంలో మరపురాని ఒక త్యాగపూరిత, సాహసోపేత ఘటన. ఎందరో తమ ప్రాణాలను పణంగా పెట్టి, దేశంకోసం అమరులయ్యారు.

జాతీయోద్యమ స్ఫూర్తి నేపథ్యంలో భారతదేశాని కొచ్చిన చెంచయ్య, జాతీయోద్యమంలో పాల్గొని అనేక జైలు శిక్షలు - లాహోర్, కన్ననూర్, కోయంబత్తూర్ జైళ్ళలో 8 సంవత్సరాలు గడిపాడు.

జాతీయోద్యమంలో ఒకవైపు కొనసాగుతూనే, రాజకీయ, సంస్కరణలు సక్రమంగా ఫలవంతం కావాలంటే, సామాజిక మార్పుకు, సంఘ సంస్కరణలకూ కృషి చేయాలనుకొన్నాడు. మతం, కులం, అనేక సంఘ దురాచారాలు - భారతీయ సమాజపు విలువలను పీల్చేస్తున్నాయి. వాటి నిర్మూలనకు నడుంకట్టాడు. ఇది ఆయన జీవితంలో 'సంస్కరణదశ'కు దారితీసింది. 'స్వకుల' సంస్కరణతోపాటు, ఆయన

కార్యరంగం కళావంతుల సంస్కరణకు విస్తరించింది. వితంతు వివాహాలు, అనాధ శిశు సంరక్షణశాలలు, పతిత యువతీ జనోద్ధరణ, హరిజనోద్యమం, వయోజనోద్యమాల్లో చురుగ్గా కృషి చేశాడు. 'నేనూ - నా దేశం' గ్రంథంలో సంస్కరణ కృషిని తెలిపే భాగాలు చదువుతున్నపుడు వళ్ళు గగుర్పాటు చెందుతుంది. ఈ కృషిలో ఆయనకు చేదోడు వాదోడుగా నిల్చిన యామినీ పూర్ణతిలకం గురించిన విలువైన సమాచారం ఈ గ్రంథంలో చోటుచేసుకుంది. 1924-30ల మధ్య జరిగిన వితంతు పునర్వివాహ ఉద్యమం గూర్చి యిలా అంటాడు. **"వీరేశలింగంగారు నాటిన విత్తనం యాభై ఏండ్లకు పెద్ద వృక్షమై ఆంధ్రదేశంలో అనాధ స్త్రీలకు ఆశయమిచ్చింది."** (పుట 346). ఆంధ్రదేశంలో సంఘ సంస్కరణోద్యమం 1920ల తర్వాత కూడా కొనసాగిందనీ, దానికి ఎందరో కృషి చేశారన్న వాస్తవం దరిశి చెంచయ్యగారి గ్రంథం రుజువు చేస్తుంది.

సంస్కరణ దశ నుండి చెంచయ్య తన చివరి పోరాట దశను - సామ్యవాద దశ - 1935 నుండి చేరుకొన్నాడు. అప్పటికి ఆంధ్రదేశంలో కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ కార్యకలాపాలు, కమ్యూనిస్టు పార్టీ నిర్మాణం ఒక రూపుదిద్దుకొంది. ఆ తొలినాటి వామపక్ష రాజకీయాల గూర్చిన ఎంతో విలువైన అంశాల గూర్చి యీ గ్రంథం తెలియచేస్తుంది. కమ్యూనిస్టు పార్టీలో తాను చేరడానికి స్త్రీ విముక్తి అనే ఆశయం ఎలా దోహదం చేసిందీ, ఆయన మాటల్లోనే తెలుసుకొందాం. **"నేను కమ్యూనిస్టు కావడానికి ముఖ్య కారణం స్త్రీల కష్టాలను తొలగించడానికి ప్రయత్నాలు చేసి, చేసి, పూర్తిగా సాధించలేకపోవడం వల్ల కలిగిన అసంతృప్తి, స్త్రీల కష్టాలు ఒక్క సోషలిస్టు రష్యాలో మాత్రమే నశించాయన్న సత్యమే నన్ను కమ్యూనిజంవైపు తిప్పింది"** అంటాడు. (పుట 489).

సామ్యవాద దశలో చెంచయ్య మద్రాసులో, కార్మిక సంఘాల్లో బీడీ, చుట్టల కార్మిక సంఘాలతోపాటు, స్పెన్సర్ కంపెనీ, మద్రాసు కార్పొరేషన్ పనివారల అభ్యున్నతికి పాటుపడ్డాడు. కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాణంలోని అనుపానుల గూర్చి, వాటి పని తీరును గూర్చి నిజాయితీతో విశ్లేషించాడు.

జీవిత ప్రారంభం నుండి తానెదుర్కొంటున్న ఈతిబాధలు, వాటికి తోడు ఆర్థిక బాధలు చెంచయ్యగార్ని వెంటాడుతూనే వున్నాయి. జీవితపు ఆటుపోట్లలో ఆయనకు

దన్నుగా నిలిచిన భార్య దరిశి సుభద్రమ్మ మహిళా సంఘాల్లో కృషి చేస్తూ, స్త్రీల అభ్యున్నతికి పాటుపడింది. సుభద్రమ్మ కృషి గూర్చి ఇంతవరకూ ఎవరూ ఎక్కడా పేర్కొనకపోవడం దురదృష్టం. అనిబిసెంట్ సహచారిణిగా వుంటూ, అఖిల భారత మహిళా సమాఖ్య కార్యక్రమాల్లో, దక్షిణ భారతదేశంలో చురుగ్గా పాల్గొన్నారు. ఆమె నేతృత్వంలో పతిత యువతీ జనోద్ధరణ, స్త్రీలల్లో విద్యా వ్యాప్తి కొనసాగింది. దరిశి చెంచయ్యగారి జీవిత చరిత్ర ఒక గని లాంటిది. ఆయన జీవిత లక్ష్యం, దేశ స్వాతంత్ర్యమే కాదు. స్వాతంత్ర్యానంతరం, సమాజం ఏ దిశలో నడవాలీ, దేశ పునర్నిర్మాణం బడుగుల జీవితాల్లో ఎలాంటి మార్పులు తీసుకురావాలో ఆయన ఆశించాడు. ఆర్థిక అసమానతలు, సామాజిక ఎత్తుపల్లాలను తొలగించి, స్త్రీ జనోద్ధరణ దేశానికి ఆయువుపట్టుగా భావించి కృషి చేసిన మహనీయుడు. ఈ క్రమంలో రూపుదిద్దుకొంది చెంచయ్యగారి వ్యక్తిత్వం. ఆయన ప్రాపంచిక దృక్పథానికి, తను పాల్గొన్న ఉద్యమాలు ఎలా దోహదం చేశాయో వ్యక్తీకరిస్తుంది ఈ గ్రంథం. చిత్తశుద్ధికి నిష్కపటత్వం తోడై, స్వీయ పొరబాట్లను నిష్కర్షగా అంగీకరించే మనస్తత్వం ఆయనది. చిన్నప్పటి నుండీ ఒక నిరసనవాదిగా మార్పుకోసం కృషి చేయాలన్న తపన ఆయన రాసిన ప్రతి అక్షరంలో కన్పిస్తుంది. నేటి యువతరం తప్పక చదవాల్సిన గ్రంథం ఇది.

**"గ్రంథాలయ సర్వస్వం - శతవసంత సాహితీ మంజీరాలు" వాల్గవ భాగం**

**ఆకాశవాణి సౌజన్యంతో**

# కుల వ్యవస్థపై చర్చావేదిక

జులై నెల "కమ్యూనిజం"లో స్వాతంత్ర్య సమరయోధులు, కమ్యూనిస్టు నాయకులు శ్రీ ముళ్ళపూడి సూర్యనారాయణ, కుల వ్యత్యాసాల నిర్మూలనకు మరో సామాజిక విప్లవం ఆవశ్యకత గురించి ఒక వ్యాసం వ్రాశారు. ఇందులో అనేక ఆసక్తికర విషయాలు ఉన్నాయి. అందుపై చర్చ ఉపయుక్తంగా వుండ గలదని భావించి చర్చావేదికలో పాల్గొనవలసిందిగా పాఠకులను ఆహ్వానించాం. శ్రీ టి. రవిచంద్, శ్రీ టి.ఎమ్. రెడ్డిగార్ల అభిప్రాయాలను ఈ సంచికలో అంద జేస్తున్నాం. ఈ చర్చావేదికలో పాల్గొనవలసిందిగా పాఠకులను ఆహ్వానిస్తున్నాం.

సం॥

## కులవివక్ష కూలిపోవాలంటే...

శ్రీ టి.యం. రెడ్డి

ఇప్పుడిప్పుడే కులవ్యవస్థ కూలిపోదు. దాని వేళ్ళు గట్టిగా నాటుకుని వున్నాయి. నేను చేయబొయ్యే సూచనలు వెంటనే ఆచరణసాధ్యం కావని నాకు తెలుసు. ఐనా, ఈ దిశగా ప్రయత్నాలు చేసి తీరాలనే ఉద్దేశంతో ఈ మాటలు రాస్తున్నాను. నా సూచనలు :

(క) కులాంతర వివాహాలను ఇతోధికంగా ప్రోత్సహించాలి. దీనికోసం -

1. కులాంతర వివాహం చేసుకునే ప్రతి నిరుద్యోగ దంపతులకూ ఆర్థిక ప్రోత్సాహకాలు ప్రభుత్వమూ, స్వచ్ఛంద సంస్థలూ కల్పించాలి. ఇది ఏదో 'నామ్ కే వాస్తే' కాకుండా, భారీగానే వుండాలి.
2. ఉద్యోగంలో వుంటూ కులాంతర వివాహం చేసుకునే దంపతులకు రెండు ఇంక్రిమెంట్లు అదనంగా మంజూరు చేయాలి.
3. యువతీ యువకులు భావకవితకూ, వాస్తవికతావాద నవలలకూ, ప్రేమకథలకూ

స్పందిస్తూ, నిజజీవితంలో ఆ ఆదర్శాలను ఆచరణసాధ్యం చేసేట్లు చూడాలి. ఇందుకోసం వారు చదివే చదువుల్లో ప్రేమకు పెద్దపీట వేయాలి. దాన్నొక వాస్తవ జీవిత సత్యం చేయాలి.

4. తక్కువ ఖర్చుతో పెళ్ళిళ్ళు జరగాలి. భారీ విందుల్ని విరమించాలి.
5. కులాంతర వివాహ వేదికలు ప్రతి మండలంలోనూ ఏర్పరచాలి. ఇవి యువ జంటలకు యధోచిత సలహాలు ఇవ్వాలి. వివాహానంతరం కూడా దాంపత్య జీవితం సజావుగా సాగేట్లు చూసేందుకు ప్రయత్నించాలి.

(ఖ) కులవ్యవస్థ పుట్టుపూర్వోత్తరాలను గురించిన అవగాహన, పునరుజ్జీవన యుగంలో వచ్చిన హిందూమత సంస్కరణలనూ, కులనిర్మూలనా వాదాన్ని గూర్చిన ఓ సమగ్ర అవగాహన కలిగేట్లు మన పత్రికలు విరివిగా రాయాలి. రేడియో, దూరదర్శన్‌లు పలు కార్యక్రమాలు ప్రసారం చేయాలి.

(గ) అనుసూచిత కులాలైన 'హరిజనుల' కులాంతర వివాహాలు విరివిగా జరిగేట్లు చూడాల్సిన బాధ్యత కార్మిక సంఘాలపై ఉంది. వామపక్షాలు దీన్ని తమ విస్తృత కార్యక్రమంలో ఒక తప్పనిసరి అంశంగా భావించాలి.

(ఘ) ప్రతిదానికీ వ్యవస్థ మారనిదే ఇది సాధ్యం కాదు, అది సాధ్యం కాదు అని అనడం తరచూ వింటూంటాం. ఈ నియతివాదం పనికిరాదు. చాలా సంస్కరణలు ప్రస్తుత పెట్టుబడిదారీ వ్యవస్థలో కూడా సాధ్యమే. మనం చేయాల్సింది వీటిని వేగికపరచడమే. ప్రజాస్వామిక వామపక్ష యువజన సంస్థలు ముందుకు వచ్చి ఈ సంస్కరణలు చేపట్టాలి. పశ్చిమ దేశాల్లో ఈ కులం కుళ్ళు లేదని మనం గ్రహించాలి.

(జ) దేశంలో 35 కోట్లమంది నిరక్షరాస్యులున్నారు. చదువురాని వాళ్ళలో ఎక్కువ భాగం అనుసూచిత కులాలు, తెగలవారే. ఈ స్థితి పోవాలి. సంపూర్ణ సాక్షరతా కార్యక్రమం ఐదేళ్ళ నిర్ణీత కాలంలో విజయవంతమయేందుకు అవసరమయ్యే అన్ని చర్యలూ తీసుకోవాలి. కేరళ అనుభవం నుంచి పాఠాలు నేర్చుకోవాలి. అవసరమైతే ఓ సంవత్సరం విద్యా సంస్థలకు సెలవు ప్రకటించి ఈ జనవిద్యా కార్యక్రమం చేపట్టాలి. ఇది సమగ్ర విద్యను, సమగ్ర అవగాహనను అందించగలగాలి. ఇది యుద్ధప్రాతిపదికన జరగాలి. జనం చేతుల్లో విద్య ఒక ఆయుధం కావాలి. దీంతో కులవ్యవస్థను గాయపరచాలి.

# కులవ్యవస్థ నిర్మూలనకు గతంలో జరిగిన ఉద్యమాల స్ఫూర్తి

శ్రీ టి. రవిచంద్

జూలై 2001 "కమ్యూనిజం" మాసపత్రికలో స్వాతంత్ర్య సమరయోధులు శ్రీ ముళ్ళపూడి సూర్యనారాయణ "కుల వ్యత్యాసాల నిర్మూలనకు మరో సామాజిక విప్లవం కావాలి, రావాలి" అంటూ రాసిన వ్యాసం ఆలోచనాత్మకంగా, సందేశాత్మకంగా ఉంది. ఈనాడు సమాజంలో వర్గ సంబంధాలకంటే కుల సంబంధాలే బలంగా వున్నాయంటున్న ఆయన అభిప్రాయంతో ఆలోచనాపరులెవరయినా అంగీకరించక తప్పదు. అంతేకాదు, వర్గ పోరాటాలలో పాల్గొనే కార్మికులలో కూడ కులతత్వ ప్రభావమున్నదంటున్న స్వాతంత్ర్య సమరయోధులు శ్రీ సూర్యనారాయణ చాలా నిజాయితీగా కుల సమస్యను గుర్తిస్తున్నారు. మతవాద సందర్భంగా విశ్వకవి రవీంద్రనాథ్ ఠాగూర్ చెప్పిన మాటల్ని కులవాద సమీక్ష సమయంలో కూడా మనం గుర్తుంచుకోవాలి. ఆ మాటలు చాలా అర్థవంతమైనవి : "మనలోకి మనం చూసుకోవాలి." కులవ్యవస్థ శ్రమవిభజనే కాదు, అది శ్రామికుల విభజన - అని ఆరు దశాబ్దాల క్రితమే డా॥ అంబేద్కర్ అన్నారు. ఆనాడు ఆయన మాటల్ని ఎవరూ పెద్దగా పట్టించుకోలేదు.

దేశంలో పారిశ్రామికీకరణ జరిగితే, కార్మికవర్గం పెరుగుతుందనీ, తద్వారా కుల విభజనలు, వ్యత్యాసాలు అంతరిస్తాయని ఆనాడు కమ్యూనిస్టులు భావించారు. నాలుగు దశాబ్దాల క్రితం "న్యూయేజ్" (జూన్, 1959) పత్రికలో ప్రముఖ కమ్యూనిస్టు మేధావి కె. దామోదరన్ "కేరళలో వర్ణవ్యవస్థ" పేరుతో ఒక వ్యాసం రాశారు. ఈ వ్యాసం తర్వాత తెలుగులో "సందేశం" (మార్క్సిస్టు సిద్ధాంత, రాజకీయ మాసపత్రిక) మే, 1960 సంచికలో ప్రచురించబడింది. ఈ వ్యాసంలో కార్మికవర్గం పెరిగి, బలపడితే కులవ్యవస్థ బలహీనపడుతుందని, వర్ణైక్యత అంతరించి, వర్గైక్యత బలపడుతుందని భావించారు. ఇది యాంత్రిక దృష్టితో కూడిన ఆశావాదం తప్పితే మరొకటి కాదు. కార్మికవర్గ చైతన్యాన్ని కూడా బలహీనపరచగల శక్తి కులవ్యవస్థకున్నదని శ్రీ సూర్యనారాయణ వ్యాసం నిరూపిస్తుంది. ఈ రోజు మనం మాట్లాడాల్సింది కుల వ్యత్యాసాల నిర్మూలన గురించి కాదు. కుల నిర్మూలన గురించే మాట్లాడాలి. ఆలోచించాలి. కుల వ్యవస్థ ఉన్నంత

కాలం కుల వ్యత్యాసాలు, కుల విచక్షణ అనివార్యంగా వుంటాయి. కాబట్టి కుల నిర్మూలన కోసం ఈ దేశంలో లౌకికవాదులంతా ఏకమై బలమైన సాంస్కృతిక ఉద్యమాన్ని నిర్మించుకోవాలి. మతతత్వంతోపాటు కులతత్వానికి కొంత మంచి జరుగుతుంది. హిందూ మతానికి ఆత్మలాంటిది కులం. ఈ కులవ్యవస్థను బలహీనపరచగలిగితే హిందూ మతోన్మాదాన్ని బలహీనపరచగలుగుతాం. హిందూ మతానికి, కులవ్యవస్థకు గల ఈ గతితార్కిక సంబంధాన్ని నిశితంగా, నిజాయితీగా మనం గుర్తించగలిగితే సమస్యకు సగం పరిష్కారం లభించినట్లే! మార్క్సిస్టు పరిభాషలో చెప్పాలంటే కులం పునాది, మతం ఉపరితలం. ఈ దేశంలో మతం లేదు, మశానం లేదు, ఉన్నదల్లా కులమేనని సి.వి. లాంటి మార్క్సిస్టులు ఏనాడో చెప్పారు. ఆయన మాటల్నీ ఎవరూ ఖాతరు చేయలేదు. కమ్యూనిస్టు ఉద్యమంలోని యాంత్రిక దృష్టివల్ల ఈ దేశానికి చాలా నష్టం జరిగిందనిపిస్తుంది. పునాది, ఉపరితలం అనే యాంత్రిక విభజనవల్ల, వాటిమధ్య గల గతితార్కిక సంబంధాన్ని విస్మరించటంవల్ల, సాంస్కృతికాంశాల బలాన్ని, శక్తిని తక్కువగా అంచనా వేశాము. దాని ఫలితమే అంతర్జాతీయ దృక్పథం ఉండాల్సిన కార్మికవర్గంలో కులతత్వ విజృంభణ! సాంస్కృతిక రంగానికి కమ్యూనిస్టు ఉద్యమం తగిన స్థానం కల్పించినట్లయితే, సోషలిజం అనే లక్ష్యాన్ని చేరుకోలేకపోయినా, కనీసం లౌకిక, ప్రజాస్వామ్య వాతావరణంలోనయినా మనం జీవించగలిగేవాళ్ళం. జరిగిందేదో జరిగిపోయింది. గతంలో మనం చేసిన పొరపాట్ల నుండి గుణపాఠాలు నేర్చుకొని, మన భావాల్ని సంపద్వంతం చేసుకుంటూ ముందుకు నడవాలి.

## అసంపూర్ణ ఉద్యమాలు

ఈ దేశంలో కులవ్యవస్థ వ్యతిరేక ప్రతిఘటనోద్యమాలు అనేక రూపాల్లో జరిగాయి. వాటి చరిత్రను ఏదో రూపంలో గ్రంథస్థం చేయడానికి కొన్ని ప్రయత్నాలు జరిగాయి. కాని అవి అసంపూర్ణంగా మిగిలాయి. ప్రాచీన కాలంనుండి ఆధునిక యుగంవరకు వర్ణవ్యవస్థను, కులవ్యవస్థను విమర్శిస్తూ వెలువడిన ఇటువంటి సాహిత్యాన్ని వెలుగులోనికి తెచ్చి ప్రజల్లో విస్తృతంగా ప్రచారం చేయాలి. వర్ణవ్యవస్థ, కులవ్యవస్థలు ఎంత అనాగరికమో, ఆటవికమో, అశాస్త్రీయమో ఈ సాహిత్యం ద్వారా ప్రజలకు తెలియచెప్పాల్సిన అవసరం ఉంది. ఆవైపు "కమ్యూనిజం" పత్రిక ఆధ్వర్యాన 1992లో "భారతదేశంలో కులవ్యవస్థ" పేరుతో ఒక సదస్సు నిర్వహించారు. అది

చాలా మంచి ప్రయత్నం. ఈ దశాబ్ద కాలంలో "మిళింద ప్రచురణలు" పేరుతో ఒక సంస్థను స్థాపించి ఆవైపు మరికొంత కృషి చేశాము. దీనిలో భాగంగా పద్దెనిమిది వందల సంవత్సరాల క్రితం వర్ణవ్యవస్థను ఖండిస్తూ మహాకవి అశ్వఘోషుడు రచించిన "వజ్రసూచి" గ్రంథాన్ని ఆంధ్రులకు అందించాము. దీనికి రాసిన పరిచయ వ్యాసంలో ఈ వ్యాస రచయిత ప్రాచీన కాలంనుండి ఇప్పటివరకు జరిగిన కులవ్యతిరేక ప్రతిఘటనోద్యమాలను, వివిధ వ్యక్తులు చేసిన కృషిని సంక్షిప్తంగా వెలుగులోకి తేవడమే కాకుండా, నేడు ఈ పోరాటాల్ని ఏ ప్రాతిపదికపై ముందుకు తీసుకెళ్ళారో వివరించాడు. ఈ గ్రంథానికి ఆంధ్రదేశంలో మంచి ప్రతిస్పందన లభించింది. కమ్యూనిస్టేతర పత్రికల్లో సంపాదకీయాలు, సమీక్షలు వచ్చాయి. కులవ్యవస్థ వ్యతిరేకత పేరుతో ప్రచారంలోకి వచ్చిన బలమైన ఒక తప్పుడు ధోరణిని కూడా పై గ్రంథానికి రాసిన పరిచయంలో విమర్శించడం జరిగింది. కుల వ్యతిరేక పోరాటాలు శాస్త్రీయ మానవవాద పునాదులపై నిర్మించాలని, ద్వేషం దీనికి ఆధారం కారాదని కూడా చెప్పడం జరిగింది. కులవ్యవస్థను ప్రతిఘటిస్తూ అన్ని వర్ణాలనుండి, అన్ని కులాలనుండి సంస్కర్తలు, విప్లవకారులు వచ్చారని, ఇది ఏదో ఒక కులానికో, వర్గానికో సంబంధించిన సమస్య కాదని, ఇది మానవ సమస్యని చారిత్రక ఆధారాలతో నిరూపించడం జరిగింది.

## పోకల లక్ష్మీనరసు కృషి

ఆధునిక యుగంలో ఆంధ్రదేశంలో బౌద్ధుడిగా, కులనిర్మూలనవాదిగా ప్రొఫెసర్ పోకల లక్ష్మీనరసు, మార్క్సిస్టుగా, కులనిర్మూలనవాదిగా డా॥ కాట్రగడ్డ బాలకృష్ణల కృషిని పరిచయం చేస్తూ కొన్ని రచనలు ప్రచురించాము. ఇంకా జరగాల్సిన కృషి చాలా వుంది. ఒక వ్యక్తి సంస్థగా మారి చేసే ప్రయత్నంలో కొన్ని పరిమితులుంటాయి. ఆ పరిమితుల్ని అధిగమించి ముందుకు ప్రయాణించటానికి గట్టిగా ప్రయత్నిస్తున్నాము.

స్వాతంత్ర్య సమరయోధులు, కమ్యూనిస్టు నాయకులైన శ్రీ ముళ్ళపూడి సూర్యనారాయణ "కుల వ్యత్యాసాల నిర్మూలనకు మరో సామాజిక విప్లవం కావాలి, రావాలి" అంటున్నారు. కమ్యూనిస్టుగా ఆయన ఇటువంటి పిలుపు నిచ్చినందుకు మేమెంతో గర్వపడుతున్నాం. ఆయనను అభినందిస్తున్నాం. 60-70 యేళ్ళ వయసులో వున్న వృద్ధతరం కమ్యూనిస్టులతోనే ఈ ఆదర్శాలు అడుగంటాయనుకొంటున్న మాలాంటివారికి శ్రీ సూర్యనారాయణ వ్యాసం చదువుతుంటే ఎంతో ఆనందాన్ని,

ఉత్తేజాన్ని కలిగించింది. ఆయన ఆశిస్తున్న మరో సామాజిక విప్లవానికి కావాల్సిన సైద్ధాంతిక అవగాహనను సంపద్వంతం చేసే సాహిత్యాన్ని తెలుగు పాఠకులకు అందించడానికి మా వంతు కృషి చేస్తున్నామని, ఒకసారి మా ప్రచురణల్ని పరిశీలించి, తగిన సూచనలివ్వమని ఆయనను అభ్యర్థిస్తున్నాం. ఇప్పటివరకు వెలువడిన మా ప్రచురణలు :

1. స్టడీస్ ఇన్ హిందూ మెటీరియలిజమ్ - డా॥ కె.బి. కృష్ణ, తొలి ముద్రణ : 1994.
2. తెలుగు వెలుగు - డా॥ కాట్రగడ్డ బాలకృష్ణ, 1995
3. భగవద్గీతలో భౌతికవాద అంశాలు - డా॥ కె.బి. కృష్ణ, 1995.
4. భారత ప్రజాతంత్ర విప్లవ సమస్యలు - శరద్‌పాటిల్, 1996 (దళిత ఉద్యమ నేపధ్యంలో డా॥ కె.బి. కృష్ణ రచనల ప్రాముఖ్యాన్ని గురించి చర్చించిన రచన)
5. బౌద్ధం అంటే ఏమిటి? - ప్రొఫెసర్ పి. లక్ష్మీనరసు, 1996
6. వజ్రసూచి (వర్ణవ్యవస్థ ఖండన) - మహాకవి అశ్వఘోషుడు, 1997.
7. బౌద్ధపండితుడు, కుల నిర్మూలనవాది - ప్రొఫెసర్ పి. లక్ష్మీనరసు, 1998.
8. మహాకవి అశ్వఘోషుని వజ్రసూచి (వివిధ పత్రికల్లో వెలువడిన అభిప్రాయాల సంకలనం), 1999.
9. అవైదిక మతాలు, కులవ్యవస్థపై డా॥ బి.ఎస్.ఎల్. హనుమంతరావు రచనలు-ఒక పరిశీలన - టి. రవిచంద్, 1999.
10. పొలిటికల్ అండ్ సోషల్ థాట్ ఆఫ్ బుద్దిస్ట్ రైటర్స్ (క్రీ.శ. రెండవ శతాబ్దం నుండి ఐదవ శతాబ్దం వరకు కులవ్యవస్థకు వ్యతిరేకంగా వచ్చిన ప్రతిఘటనోద్యమాల అధ్యయనం) - డా॥ కె.బి. కృష్ణ, 1999.

మార్క్సిస్టు దృష్టితో కులసమస్యను, అంబేద్కర్ కులనిర్మూలనోద్యమాన్ని విశ్లేషిస్తూ, చైతన్య పబ్లికేషన్స్ పేరుతో మరో రెండు రచనలు ఈ వ్యాస రచయిత ప్రచురించాడు. అవి : 1) సామాజిక విప్లవ దార్శనికుడు డా॥ బి.ఆర్. అంబేద్కర్ - టి. రవిచంద్, 1989. 2) డా॥ బి.ఆర్. అంబేద్కర్ - ప్రొఫెసర్ కొత్త సచ్చిదానందమూర్తి (ప్రొఫెసర్ మూర్తి ఆంగ్ల వ్యాసంపై జరిగిన చర్చలో పాల్గొన్న రచయితల వ్యాస సంకలనం), 1992.

# ఆంధ్రజాతీయ పునరుజ్జీవనలో కమ్యూనిస్టుపార్టీ మహోజ్వల పాత్ర

శ్రీ పరకాల పట్టాభి రామారావు

**1942-48 సంవత్సరాల మధ్య ఆంధ్రదేశంలో ఒక అపూర్వమైన సాంఘిక, సాహిత్య విప్లవం జరిగింది. ఫ్యూడల్ నాగరికత, సంస్కృతి, సంప్రదాయాలకు, అభివృద్ధి నిరోధక భావాలకు వ్యతిరేకంగా ఆంధ్ర కమ్యూనిస్టు ఉద్యమం ఈ మహోద్యమానికి ప్రేరణ, ప్రోత్సాహాలు ఇచ్చి, నాయకత్వం వహించింది. అభ్యుదయ రచయితల ఉద్యమం, ప్రజానాట్యమండలి సాంస్కృతిక ప్రదర్శనలు, యువజన, మహిళా ఉద్యమాల ద్వారా ఆంధ్రదేశంలో గొప్ప భావ పరివర్తనను తీసుకురాగల్గింది. ప్రజా సాహిత్యానికి, కళలకు నాంది ప్రస్తావన చేసింది. కొత్త పాతల మేలుకలయిక ద్వారా నవయుగాంధ్ర నిర్మాతలు కందుకూరి, గురజాడ, గిడుగు, కొమర్రాజులు ప్రారంభించిన ఆంధ్ర జాతీయ పునరుజ్జీవనోద్యమాన్ని కొనసాగించింది. కమ్యూనిస్టు ఉద్యమం 1940 దశకంలో సాధించిన ఈ విజయాన్ని దిజ్ఞాత్రంగా పాఠకులకు అందిస్తున్నాం. సం॥**

## ఉపోద్ఘాతం

ప్రజాస్వామ్యం, సోషలిజం స్థాపన లక్ష్యంగా రాజకీయ కార్యక్రమాలతోపాటు, ఆంధ్ర జాతీయ పునరుజ్జీవనానికి కమ్యూనిస్టు పార్టీ అహుముఖంగా కృషి గావించింది.

ఆంధ్ర జాతీయ పునర్వికాసానికి మూలపురుషులైన కందుకూరి, గురజాడ, గిడుగు, కొమర్రాజు లక్ష్మణరావుగార్లు, సాంఘిక, సాంస్కృతిక రంగాలలో నడిపిన మహోద్యమాల్ని కమ్యూనిస్టు పార్టీ కొనసాగించింది. జాతీయోద్యమ సత్సంప్రదాయాలను నిలబెట్టడానికి కమ్యూనిస్టు పార్టీ పూనుకుంది.

1942-43లో కమ్యూనిస్టు పార్టీ మొట్టమొదటిసారిగా బహిరంగంగా

పనిచేయడానికి అవకాశం రాగానే స్త్రీ సముద్ధరణకు విస్తృతమైన ప్రాతిపదికపై మహిళా ఉద్యమాన్ని, యువకులను ఆదర్శపౌరులుగా తయారుచేయడానికి యువజన ఉద్యమాన్ని నిర్మించడానికి పూనుకుంది. ఆంధ్రుల ప్రాచీన కళారూపాలైన బుర్రకథ, వీధిభాగవతం మొదలైనవి పునరుద్ధరించి నూతనమైన ఇతివృత్తాల ద్వారా ప్రజలలో దేశభక్తిని, సాంఘిక చైతన్యాన్ని, విజ్ఞాన ప్రబోధాన్ని కల్గించడానికి పూనుకుంది. కిరాయి నాటకాలతోను, పౌరాణిక నాటకాలతోను విసుగెత్తిన ప్రజలకు, వాస్తవిక ప్రజాజీవితాన్ని చిత్రించే నాటకాలను ప్రదర్శించుటకు ప్రజానాట్యమండలిని ఏర్పరచింది. అదేవిధంగా సాహిత్యరంగంలో ప్రగతి మార్గాన్ని తొక్కిన అభ్యుదయ రచయితల సంఘానికి ఎంతో చేయూత ఇచ్చింది. ఈ విధంగా సాంఘిక సాంస్కృతిక రంగాలలో ఈ కాలంలో ఎంతో సంచలనం తీసుకురాగల్గింది.

బాల్య వివాహాలు, నిర్బంధ వైధవ్యం మున్నగు దురాచారాలకు వ్యతిరేకంగా పోరాడి స్త్రీ పునర్వివాహాలను జరిపించడానికి, అవినీతిని - లంచగొండితనాన్ని నిర్మూలించడానికి, ఆనాడు కందుకూరి వీరేశలింగం పంతులుగారు ఎంత ప్రతిఘటనను ఎదుర్కోవలసివచ్చిందో, ఈ దశలో కమ్యూనిస్టు ఉద్యమం కూడా అంత ప్రతిఘటనను అభివృద్ధి నిరోధకుల నుండి ఎదుర్కోవలసివచ్చింది.

వీరేశలింగం, గురజాడ, గిడుగు, లక్ష్మణరాయ వర్ధంతులను పెద్దయెత్తున జరిపి, వారి ఆశయాలను గురించి ప్రచారం చేయడంతో వీరిని కమ్యూనిస్టులు తమ పార్టీ ప్రచారానికి ఉపయోగించుకుంటున్నారని ఆనాటి ప్రతీపవర్గాలు ప్రచారం చేశాయి. వాస్తవం ఏమిటంటే కమ్యూనిస్టులైన ప్రతివారు స్త్రీలకు విద్యా-విజ్ఞానాలు కల్గించడం, వితంతువులను వివాహమాడటం, వర్ణాంతర వివాహాలను చేసుకోవడం, కట్నాలు లేకుండా వివాహాలు చేసుకోవడం, ఆడంబరాలను తగ్గించి పూలదండల పెళ్ళిళ్ళు చేసుకోవడం మున్నగు సంస్కరణ పద్ధతులను స్వయంగా ఆచరించి, ఆదర్శవంతంగా ఉండటానికి శతథా కృషి చేశారు. ఇటువంటి సంస్కరణ వివాహ పద్ధతులను అమలుజరపడానికి తల్లిదండ్రులతో పేచీలు పడవలసినప్పటికీ, సనాతనులు ఎన్నో ఇబ్బందులు పెట్టినప్పటికీ కమ్యూనిస్టులు వెనుదీయలేదు. జాతీయోద్యమ కాలంలో కాంగ్రెసు మహిళలు పికెటింగులు జరిపినప్పుడు, జైళ్ళకు వెళ్ళినప్పుడు రౌడీలు-సంఘ వ్యతిరేక శక్తులు ఏవిధంగా అల్లరిచేసేవారో కమ్యూనిస్టు పార్టీకి చెందిన స్త్రీలు ధైర్యంగా సభలకు వచ్చినప్పుడు, ప్రచారానికి వెళ్ళేటప్పుడు అన్ని బాధలు పడవలసివచ్చేది.

జాతీయోద్యమ కాలంలో స్త్రీలలో వచ్చిన చైతన్యం-సంస్కరణ భావాలు, పట్టణ-మధ్యతరగతుల వరకే పరిమితం అయిపోతే, పురాతన కట్టుబాట్లకు, సంప్రదాయాలకు కోటలనదగిన గ్రామీణ ప్రాంతాలలో స్త్రీలకు చైతన్యం కల్గించడం కమ్యూనిస్టు పార్టీ చేసిన మహోత్కృష్ట కార్యమని చెప్పవచ్చు. 1944లో విజయవాడలో జరిగిన అఖిల భారత రైతు మహాసభకు 20 వేలమంది స్త్రీలు హాజరయ్యారు. బహుశా ఇంతమంది స్త్రీలు ఒక సభలో పాల్గొనడం అప్పటికీ ఇప్పటికీ అదేనేమో!

రాత్రి పాఠశాలలు, వయోజన విద్య, గ్రంథాలయాలు, తాలింఖానాలు, ఆటల పోటీలు, సాంస్కృతిక కార్యక్రమాల ద్వారా గ్రామీణ-పట్టణ యువకులలో కమ్యూనిస్టు పార్టీ అపూర్వమైన మార్పు తీసుకొనివచ్చి వారిలో దేశభక్తి, సంఘసంస్కరణాభిలాష కల్గించింది. ఎంతోమంది తమ పూర్వ జీవితంలోని చెడు వర్తనలను వదలి ఆదర్శ ప్రజాసేవకులయ్యారు.

సహపంక్తి భోజనాలు జరిపితే వీరేశలింగంగారి కాలంలో కులంలో వెలివేసేవారు. ఆనాడు అది విప్లవం. వర్ణ వివక్షతను నిర్మూలించాలన్న దీక్షతో కమ్యూనిస్టు పార్టీ సభ్యులు, యువజన మహిళా సంఘాలవారు పట్టుదలతో పనిచేసి అటువంటి పట్టింపులులేకుండా చేశారు. అస్పృశ్యత నివారణకు గాంధీజీ ఉద్యమం ప్రారంభించారు. కూమ్యనిస్టు తమ యిళ్ళలోకి హరిజనులను రానివ్వడం, వారు నీరు తెచ్చియిస్తే తాగడం మున్నగు కార్యక్రమాల ద్వారా గ్రామసీమలలో అస్పృశ్యతా నివారణకు పూనుకున్నారు. ఇందుకు ఎన్ని అడ్డంకులను ఎదుర్కోవలసివచ్చినా వారు వెనుదీయలేదు. ఇది ఈనాడు చాలా చిన్న విషయంగా కనబడవచ్చు కాని ఆ రోజుల్లో అందుకు తీవ్ర ప్రతిఘటనము ఎదుర్కోవలసివచ్చేది.

ఈ విధంగా కమ్యూనిస్టు పార్టీ, ఫ్యూడల్ సమాజ కట్టుబాట్లను, అభివృద్ధి నిరోధక సంప్రదాయాలను నిర్మూలించడానికి పెద్దయెత్తున పోరాటం సాగించి సాంఘిక సంస్కరణలను తీసుకొనివచ్చింది. సమాజంలో సగభాగంగా ఉండే స్త్రీలు విద్యా - విజ్ఞానాలు పొందాలనీ, ఆర్థిక స్వాతంత్ర్యం సంపాదించాలనీ, అప్పుడే వారి పరాధీనస్థితి తొలగుతుందనీ వారిలో చైతన్యం కలిగించింది. యువజన సంఘాల ద్వారా యువకులలో, బాల సంఘాల ద్వారా బాల బాలికలలో దేశభక్తిని, అభివృద్ధికర భావాలను తీసుకొనివచ్చింది.

సాహిత్యరంగంలో, సాంస్కృతిక రంగాలలో వీరేశలింగం, గురజాడలు

